
चन्दामामा
चांदोबा
CHANDAMAMA

# A POLIO-FREE INDIA!

PULSE POLIO IMMUNIZATION

DEC 7 – JAN 18

The goal gets nearer!
Take the next step on
**National Immunisation Days:**

## December 7, 1996
## January 18, 1997

CALLING PARENTS!

Even if

* the child is indisposed or has diarrhoea
* the child had been given polio drops earlier

TO ENSURE CENT PER CENT PROTECTION



**Remember to**

Take your children (under 5) to the nearest immunisation booth / centre to receive **TWO ADDITIONAL DROPS OF THE ORAL POLIO VACCINE on National Immunisation Days**



The future of the country depends on the future of our healthy children



POLIOPLUS

**LET US STRIVE TOWARDS CREATING A POLIO-FREE INDIA BY 2000 A.D.**



ఇదుగో పిల్లలూ! సచిన్, యింకా మీరు
ఇష్టపడే యితర క్రికెట్ హీరోల్ని
చూడండి కళ్ళకికట్టినట్టుగా
ఉత్సాహంతో, రస్నా స్ప్రెడ్ మేకర్‌తో.



World Cup-96 Achievers Collection

# FREE

**Cricketer Card With Every Pack**











- రుచిగలది
- పొదుపైనది
- చేయడం తేలిక





క్రికెట్ ఆడే ఉత్సాహంగల పిల్లల్లారా, వినండి!
మీకు మనసైన రస్నా స్ప్రెడ్ మేకర్ ప్యాక్ తెరవడంతోటే ఉరకవేసే ఉత్సాహం మొదలవుతుంది.
మీ మమ్మీ 500 గ్రాముల రుచిగల స్ప్రెడ్ మీకోసం చేసిపెట్టేదాని సంగతి కాదు, మేముచెప్పేది. ఈ సారి ఎంతో ప్రత్యేక మైనది ఇంకొకటిఉంది కేవలం మీకోసం. మీరు మనసుపడే రస్నా స్ప్రెడ్ మేకర్ ప్రతి ప్యాక్‌లోనూ ఉత్సాహం రేకెత్తించే ఒక క్రికెటర్ కార్డ్‌వుంది. అదికూడా, ఉచితంగా!!
ఇక బోనస్ ఏమిటంటే, మీరు కావాలని కోరుకునే రుచిగల స్ప్రెడ్ వుండనేవుందిక! ఇక ఆ శాండ్‌విచ్‌ని, చపాతీనీ లేదా పూరీని రుచిభరితంగా చేసుకోండి - రస్నాస్ప్రెడ్ మేకర్‌తో.

ప్యాక్‌లు యీ ఆఫర్ లేకుండా కూడా లభ్యమవుతాయి.

Mudra:EAMR:9543 Tel.





**Wanna listen to rangeela?**

Presenting 'My own band'. Realistic beats. Disco lights. Four rap sounds - rattle drum, side drum, bass drum and cymbals. Composes simple tunes.

**Bol baby bol, rock 'n'roll!**

A fabulous 3-in-1. Happy b'day tune. Mini keyboard with 11 piano keys. Rap music with 5 rap sounds.

# Have a peppy, groovy, feet-tapping, rock'n'roll, zingy, freaked-out, pacy, musical Diwali.





**Kapil and Sachin have a secret to say!**

Talking Pocketable Phone. Listen to what Sachin and Kaps have to say about cricket. Real telephone sound. Musical push-key functions.

**Mom, there's a cake in my piano!**

Birthday Cake Piano. Play the birthday song as you celebrate. 13 keys. Accurate musical scale. Perfect tones.




**M M Toys Industries Ltd**

5, Chandra Bagh Avenue (Opp. Hotel President),
Mylapore, Chennai 600 004. Ph : 835151, 8543915. Fax : 8552660.

HTA.7454.97




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి



## ఆడపిల్లల చదువు - సమానమైన జన్మహక్కు

ఇటీవల మనం ఉపాధ్యాయుల దినం, ప్రపంచ అక్షరాస్యతా దినం దేశవ్యాప్తంగా జరుపుకున్నాం. ఆ సందర్భంగా దేశాభివృద్ధికి విద్య ప్రాముఖ్యతను గురించి పెద్దలు తమ ఉపన్యాసాలలో వివరించారు. ముఖ్యంగా స్త్రీ విద్యను గురించి కూడా ప్రస్తావించారు. మన దేశంలో మహిళాభ్యుదయం కోసం పాటుపడిన వారిలో మహాత్మాగాంధీ మున్నెన్నతగినవారు. "ఒక పురుషుడికి విద్యనేర్పితే ఒక వ్యక్తి మాత్రమే విద్యావంతుడవుతాడు. కాని, ఒక స్త్రీకి విద్య నేర్పితే ఆ కుటుంబానికే విద్య నేర్పినట్టవుతుంది!" అని గాంధీజీ అన్న మాటలు గుర్తుంచుకోవడం అవసరం.

ఆడపిల్లలకు చదువెందుకు? ఇంటిపనులు నేర్చుకుంటే చాలదా? అనేకాలం మారింది. ఆడపిల్లలను అధికంగా చదివిస్తే, అంతే చదివిన వరుణ్ణి పట్టడం, అంతపెద్ద కట్నం ఇవ్వడం సమస్య కదా? అని తల్లిదండ్రులు ఆలోచించే కాలం కూడా పోయింది. అభివృద్ధి సాధించాలంటే విద్య అవసరం. అందులో ఆడా, మగా తేడా లేదు - అనే కాలఘట్టంలో ప్రస్తుతం మనం ఉంటున్నాం. అన్ని రంగాలలోనూ మగపిల్లలకు సమానంగా ఆడపిల్లలు పోటీపడి ముందడుగు వేస్తున్నారు. ఇది సంతోషించ తగ్గ పరిణామం.

అయితే, ఇక్కడ గమనించవలసిన ఒక విషయం ఏమంటే అంతో ఇంతో ఉన్న కుటుంబాలలోని ఆడపిల్లలే చదవ కలుగుతున్నారు. దారిద్ర్యరేఖకు దిగువ ఉన్న కుటుంబాలలోని ఆడపిల్లలకు చదువు ఇంకా అందుకోలేని దూరంలోనే ఉన్నది. అటువంటి వారికి కూడా చదువును అందుబాటులోకి తీసుకురావాలి. రాజ్యాంగంలో జన్మహక్కుగా ఉన్న విద్య అనుదిన జీవితంలో కూడా అందరికీ అందుబాటులోకి రావాలి.

సంపుటి : 99 నవంబర్ 96 సంచిక : 5

విడిప్రతి : 6.00 సంవత్సర చందా : 72.00



వార్తలు - విశేషాలు:

# నోబెల్ శాంతి బహుమతి

ఇండోనేషియా సమీపంలోని చిన్న ద్వీపం టైమోర్. ఆ ద్వీపానికి ఇంకా శాంతి రావలసి ఉన్నది. అయినా, ఆ ద్వీపవాసులు స్వతంత్రం సాధించడానికీ, అక్కడ శాంతి నెలకొల్పడానికీ అహింసాయుతంగా పోరాటం సాగిస్తూన్న ఇరువురు నాయకులకు ఈ సంవత్సరం నోబెల్ శాంతి బహుమతి ఇవ్వాలని అవార్డు కమిటీ నిర్ణయించింది. టైమోర్ బిషప్ కార్లోస్ ఫిలిప్ బెలో; ప్రవాసజీవితం గడుపుతూ ద్వీపం స్వతంత్రంకోసం కృషి చేస్తూన్న తూర్పు టైమోర్ నాయకుడు జోస్ రోమోస్ హెూర్తా అనే ఇద్దరు నాయకులు ఈ బహుమతిని అందుకుంటున్నారు.

దాదాపు ఐదు శతాబ్దాలుగా తూర్పుటైమోర్‌ద్వీపం పోర్చుగీసుల ఆధీనంలో ఉన్నది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచం నుంచి వలస పాలనా విధానం అంతరించి పోవడంతో, టైమోర్ ప్రజలు కూడా స్వతంత్రం కోసం పోరాటం ప్రారంభించారు. ఈ పోరాటం 1975 నాటికి ఒక కీలకమైన ఘట్టాన్ని చేరుకున్నది. అధికార మార్పిడికి ఎటువంటి ఏర్పాట్లు చేయకుండా, పోర్చుగీసు పాలకులు హఠాత్తుగాద్వీపం వదిలి వెళ్ళడానికి నిర్ణయించారు. స్వతంత్ర పోరాటాన్ని నడుపుతూ వచ్చిన వామపక్ష సంస్థఫ్రెటెలిన్, రాజధాని దిలీ నుంచి స్వతంత్రం ప్రకటించింది. అయితే ఇండోనేషియా, తూర్పు టైమోర్ స్వతంత్రం పొందడానికి అంగీకరించలేదు. ఫ్రెటెలిన్‌కు వ్యతిరేకంగా సైనిక దళాలను పంపింది. అప్పుడు జరిగిన ఆయుధ పోరాటంలో దాదాపు 2,00,000 మంది టైమోర్ ప్రజలు మరణించారు. 1976 జూలై నెలలో ఈ ద్వీపాన్ని, ఇండోనేషియా తన 27వ రాష్ట్రంగా కలుపుకున్నది.

అయినప్పటికీ, ఈనాటి వరకు ఐక్యరాజ్య సమితి తూర్పు టైమోర్‌ను ఇండోనేషియాలో భాగంగా గుర్తించ లేదు.

1991 నవంబర్ 12వ తేదీ రాజధాని దిలీలో మానవ హక్కుల కార్యకర్త ఒకరి మరణానికిసంతాప సభ ఏర్పాటు చేశారు. ఆ సంతాప సభకు దాదాపు 3000 మంది ప్రజలు హాజరయ్యారు. వారి మీద ఇండోనేషియా సైన్యం కాల్పులు జరపడంతో 50 మందికి పైగా మరణించారు. ఆ తరవాత ఫ్రెటెలిన్ నాయకుడు సనానా గుస్మావోను జైల్లో పెట్టారు. ఇంతవరకు ఆయన్ను విడుదల చేయలేదు.

టైమోర్ నాయకుడు రామోస్ హెూర్తా 1975వ సం॥లో దేశం వదిలి స్వచ్ఛంద ప్రవాస జీవితం చేపట్టాడు. దేశానికి వెలుపలినుంచి దేశ స్వతంత్రం కోసం కృషి చేస్తున్నాడు. ఆయన అనేక సంవత్సరాలు ఐక్యరాజ్య సమితిలో అనధికార తూర్పు టైమోర్ ప్రతినిధిగా ఉన్నాడు. అయినా ఐక్యరాజ్య సమితి తన దేశానికి అబ్జర్వర్ స్థాయి కూడా కల్పించక పోవడంతో ఆయన న్యూయార్క్‌ను వదిలి, ఆస్ట్రేలియాకు చేరాడు. అక్కడినుంచి ఆయన తూర్పు టైమోర్ అంతర్జాతీయ ప్రతినిధిగా ఉంటున్నాడు.

ఇండోనేషియా ప్రపంచంలో అతి పెద్ద ముస్లిం దేశం. అయినా, తూర్పు టైమోర్‌లో దాదాపు 80 శాతం మంది క్రైస్తవులే ఉంటున్నారు. 1983వ సం॥లో బిషప్ బెలో అక్కడికి వెళ్ళాడు. ఆయన ప్రజా ఉద్యమాన్ని బలపరచాడు. ద్వీపం నుంచి ఇండోనేషియా సైన్యం ఉపసంహరించుకున్న తరవాత, ఈ విషయం మీద ఒక రెఫరెండమ్ అంటే ప్రజాభి ప్రాయ సేకరణ జరపాలని ఆయన ఐక్యరాజ్య సమితికి ఒక ఉత్తరం రాశాడు. ఆ విషయంగా ఐక్యరాజ్య సమితి నుంచి సమాధానం రాకముందే – బిషప్ అభిప్రాయానికి మద్దతునిచ్చే చాలామంది ప్రజలను ఇండోనేషియా అధికారులు జైళ్ళలో పెట్టారు. ఆనాటి నుంచి తూర్పు టైమోర్ నుంచి బిషప్ బెలో; వెలుపలి నుంచి రామోస్ హెూర్తా – తూర్పు టైమోర్ స్వతంత్ర పోరాటానికి న్యాయమైన శాంతియుత పరిష్కారం కోసం కృషి చేస్తున్నారు. వారి కృషికి గుర్తింపుగానే ప్రతిష్ఠాత్మకమైన నోబెల్ శాంతి బహుమతి లభించింది.







# విష్ణుభట్టు కథ

చందనపురం చిన్న సంస్థానమైనా, ఆ సంస్థానాధిపతి కమలచంద్రుడు సంస్థానంలోని కవిపండితులందర్నీ ఎంతో ఆదరిస్తూ మంచి పేరు తెచ్చుకున్నాడు. యువకుడైన మురళీనాధుడు చందనపుర సంస్థానంలోని గొప్ప కవుల్లోఒకడు.తన కవితాచాతుర్యం, వాక్చాతుర్యం మొదలైనవాటితో మురళీనాధుడు, కమలచంద్రుడికి ప్రీతిపాత్రుడైన కవిగా ఆయనతో బాగా సాన్నిహిత్యాన్ని సంపాదించాడు. ఇది మిగిలిన కవులకు భరించ రానిదిగా తయారైంది. ముఖ్యంగా వయస్సులోనూ, లోకానుభవంలోనూ మురళీనాధుడి కంటే బాగా పెద్దవాళ్ళయినఇద్దరు, ముగ్గురు కవులు ఈర్ష్యాగ్నితో జ్వలించిపోసాగారు.

ఇలా వుండగా, యువకుడైన మురళీనాధుడికి వివాహమై, భార్య కాపురానికి వచ్చింది. ఆమె, చందనపురానికి ఆరుక్రోసుల దూరంలో వున్న గౌరీపురంలో నివసించే, రామచంద్రుడనే పండితుడి ఏకైక కుమార్తె. ఆమె పేరు గోదాదేవి.

కాపురానికి వచ్చిన గోదాదేవి, కొద్దిరోజుల్లోనే మురళీనాధుడి అంతరంగపు లోతుల్ని గమనించి తెల్లబోయింది. భావుకుడూ, మంచి కవీ అయిన మురళీనాధుడికి స్త్రీల పట్ల చాలా చులకనభావం ఉన్నది. ఇది తెలియక ముందు, భర్త కవితారచనలో ఒకటి రెండు సార్లు జోక్యం చేసుకోబోయింది గోదాదేవి. మురళీనాధుడు వెంటనే కసురుతున్నట్టుగా మాట్లాడి, భార్యను అక్కణ్ణించి వెళ్ళగొట్టాడు.

ఇలా రోజులు గడుస్తుండగా, ధనుర్మాసం వచ్చింది. తమ ఇంట ఎంతో వైభవంగా జరిపే, ఆ ధనుర్మాసోత్సవానికి కూతుర్ని పిలుచుకుని వెళ్ళటానికి రామచంద్ర పండితుడు స్వయంగా వచ్చాడు. మురళీనాధుడు, మామగారి ఆహ్వానాన్ని మన్నించి, గోదాదేవిని తీసుకువెళ్ళమనీ,

లక్ష్మీగాయత్రి

తను పండుగనాటికి వస్తాననీ చెప్పాడు. గోదాదేవి సంతోషంగా తండ్రితో ప్రయాణమై వెళ్ళింది.

గోదాదేవి వెళ్ళిన మూడవరోజున, ఎప్పటి లాగే సభలో కవితాగానం చేస్తున్నాడు మురళీ నాధుడు. ఆనాటి అతడి కవిత్వం ప్రకృతి రామణీయకతకు సంబంధించినది. ఎంతో భావయుక్తంగా కవితాగానం చేస్తున్న మురళీ నాధుడికి, హఠాత్తుగా అడ్డువచ్చాడు కమల చంద్రుడు.

"యువకవీ, మీరు పరిచయమైన నాటి నుంచి, మీ కవిత్వాన్ని గమనిస్తున్నాను! ఎంతసేపూ ప్రకృతిని వర్ణిస్తారు. ప్రకృతిలోని నిర్మలత్వానికిగాను, ఆ సృష్టికర్తను అభినం దిస్తూ,నమోవాకాలర్పిస్తారు.అంతేగాని, భగవం తుడికి సాక్షాత్తు ప్రతినిధిగా, ఈ భూమినేలే రాజు, సమస్త ప్రకృతినీ, ఆ ప్రకృతిలోని జీవ రాశుల్నీ ప్రశాంతంగా వుంచటానికి, ఎంతగా శ్రమిస్తాడో మీ కవిత్వంలో ఎక్కడా పొగడరు సరికదా, కనీసం ఆ ప్రసక్తి కూడా ఎత్తరు.మా రాజవంశీకుల్ని మీ కవిత్వంలో అంతగా విస్మ రించటానికి ఏదైనా ప్రత్యేక కారణమంటూ వుంటే తెలుసుకోవాలని కుతూహల పడు తున్నాను," అన్నాడు.

హఠాత్తుగా కమలచంద్రుడు అడిగినరీతికి, మురళీనాధుడు నివ్వెర పోయాడు. ఎంత ప్రయత్నించినా కమలచంద్రుడికి జవాబివ్వను నోరు రాలేదు మురళీనాధుడికి. దానికి కారణం, అతడి ఆంతర్యమే!

ధనార్జనకోసం రాజసేవచేస్తున్నా మురళీ నాధుడికి,రాజులపట్ల కించిత్ ద్వేషం అంత రాంతరాల్లో ఉన్నది. రాజులు ఎంత ఆదరాభి



మానాలతో ప్రవర్తించినా, వారి ఆంతర్యం అహంకారపూరితంగా ఉంటుందని అతడి గాఢమైన నమ్మిక.

కరుణాహృదయుడు, శరణుజొచ్చిన శత్రు వునైనా క్షమించ గలవాడు, సాక్షత్తూ ఆ భగ వంతుడొక్కడేనని, మురళీనాధుడు ప్రగాఢంగా విశ్వసిస్తాడు. ఆ కారణంగానే భగవంతుణ్ణి, అతడి సృష్టి అయిన సమస్తప్రకృతిని వస్తు వుగా తీసుకుని రమ్యమైన కవిత్వంచెప్పేవాడు.

మురళీనాధుడి కలవరపాటూ, రాజడిగిన దానికి వెంటనే జవాబు చెప్పకపోవటం గమనించిన వయోవృద్ధుడైన కవి గంగాభట్టు నెమ్మదిగా, "ప్రభూ! ఇంతటి చిన్న ప్రశ్నకు మురళీనాధుడు జవాబు చెప్పకుండా మౌనం వహించాడంటే,అతడికి రాజులపట్ల సద్భావం లేదేమోననిపిస్తున్నది!" అన్నాడు.



గంగాభట్టు మాటలు వినగానే, కమల చంద్రుడి ముఖంలోఒక్కసారిగాఆగ్రహావేశాలు పొటమరించాయి. ఆయన కాస్త కటువుగా, "యువకవీ, దినభత్యంకోసం, అంత మనసు చంపుకుని వ్యవహరించ నవసరం లేదు. రేపటి నుంచీ విధితప్పకుండా ముప్పొద్దులా స్వయంపాకాలు మీ గృహానికి వస్తాయి. హాయిగా నీడపట్టున విశ్రాంతిగా వుంటూ, మీ ఇష్టానుసారం కవిత్వరచన చేసుకోండి!" అన్నాడు.

నిండుసభలో కమలచంద్రుడు అన్న మాటలతో, మురళీనాధుడికి తల కొట్టేసి నంతపనైంది. ఆ క్షణాన రాజుకు ఎటువంటి సంజాయిషీ ఇవ్వటానికీ నోరు రాక, అతడు రాజుకు నమస్కరించి, తలవంచుకుని సభలోంచి బైటికి వచ్చేశాడు.

ఆ క్షణం నుంచీ మురళీనాధుడికి మనసు మనసులో లేకుండా పోయింది. రాత్రి పక్క చేరితే కళ్ళు మూతపడటం మానేశాయి.

పగలు క్రమం తప్పకుండా రాజభవనం నుంచి వస్తున్న స్వయంపాకాలతో తయారైన భోజనం, విషప్రాయంగా అనిపించసాగింది. ఈ విధంగా నిద్రాహారాలు లేక, మనస్థిమితం లేక వారం రోజులు గడిచేసరికల్లా అతడు, ఏడాదినుంచి జబ్బు పడివున్నవాడిలా పీక్కు పోయాడు.

ఆ స్థితిలో, ఒకనాటి ఉదయాన్నే ఇల్లు విడిచి బయలుదేరిన మురళీనాధుడు దారీ తెన్నూ లేకుండా నడిచి, మధ్యాహ్నానికి ఊరి పొలిమేరకు చేరుకుని, అక్కడ ఒకచెట్టు కింద శోషవచ్చినట్టుగా చతికిలబడ్డాడు. చుట్టూ పళ్ళతోటలు, వాటి మధ్యగా ప్రవహిస్తున్న చిన్న కాలవ. చెట్లపై నుంచి వీచే చల్లనిగాలి. ఈ ఆహ్లాదకరమైన వాతావరణం అతణ్ణి కొంతసేదతీర్చింది. రాజు పరుషపుమాటలతో నీరసించిన మురళీనాధుడికి ఆత్మవిశ్వాసం మెల్లగా కొత్తఊపిరి పోసుకోసాగింది. అలా నవోత్సాహం అంకురించినప్పటికీ, తిరిగి కమలచంద్రుడి ప్రాపకం సంపాదించటం ఎలా అన్నది, అతడి ఆలోచనకు అందలేదు.

ఆసమయంలో అక్కడికి ఒక నవయువ కుడు వచ్చి, మురళీనాధుడికి నమస్కరిం చాడు. మురళీనాధుడు, అతడికి ప్రతినమ స్కారం చేస్తూ, "మీరు?" అంటూ ఆగిపోయాడు.

యువకుడు నవ్వుతూ, "నన్ను విష్ణుభట్టు అంటారు, బావగారూ! మాది గోదాదేవి అక్క గారింటికి పక్కల్లే. అక్కపెళ్ళిలోనే మిమ్మల్ని చూశాను," అన్నాడు.

మురళీనాధుడు తలాడించి పూరుకున్నాడు.

"ధనుర్మాస సందర్భంగా, రాజాస్థానంలో మీ ప్రత్యేక కవితాగానం వుంటుందని అక్క చెబితే, మనసాగక వస్తున్నాను. అవునూ, ఇలా వేళగాని వేళ ఇక్కడున్నారేమిటి?" అని ప్రశ్నించాడు విష్ణుభట్టు.

మురళీనాధుడికి చప్పున ఏమని జవాబివ్వాలో తోచలేదు. విష్ణుభట్టు క్షణం ఆగి, "మీరేదో చాలా అశాంతిగా వున్నట్టు కనబడుతున్నారు. మీ మనసును కలతపరిచే సంఘటన ఏదైనా జరిగిందా?" అని అడిగాడు.

మురళీనాధుడికి, విష్ణుభట్టు ఆదరపూర్వకమైన ప్రశ్న వినేసరికి, అంతా అతడికిచెప్పకోవాలనిపించింది. ఎటూ చెప్పవలసిందే. ఎందుకంటే, విష్ణుభట్టు బయలుదేరిందే రాజాస్థానంలో తన కవిత్వం వినటానికి!

మురళీనాధుడి ద్వారా విషయ మంతా తెలుసుకున్న విష్ణుభట్టు చిరునవ్వు నవ్వి, "మీ సమస్యకు నేనొక ఉపాయం చెప్పగలను. చెప్పమంటారా, బావగారూ?" అన్నాడు. "సరే, అదేమిటో చెప్పు!" అన్నాడు మురళీనాధుడు ఆత్రుతగా.

"ముందు మీరు రాజుల పట్ల మీకున్న చిన్నచూపును మార్చుకోండి. రాజుగా పుట్టినవాడు, రాజదర్పాన్ని కొద్దోగొప్పో చూపించవచ్చుగాక! కాని పాండిత్యానికీ, కవనచాతుర్యానికీ పెద్దపీటవేసి, మీబోటి సరస్వతీ పుత్రుల పాదాలు స్వయంగా కడిగి గండపెండేరంతో అలకరించిన రాజులూ; కవి పండితులను సాక్షాత్తు శారదామూర్తులుగా భావించి, వారు ఎక్కిన పల్లకీకొమ్మును స్వయంగా తమ భుజాల



మీద మోసిన రాజులూ చరిత్రలో వున్నారన్న నగ్నసత్యం తమకు తెలియనిది కాదు గదా," మృదుగంభీరస్వరంతో అన్నాడు విష్ణుభట్టు.

అతడి మాటల్లోని సత్యాన్ని అంగీకరిస్తూ, ఆత్మ పరిశీలన చేసుకుంటున్నట్టుగా మురళీనాధుడి తల కాస్త వంగింది.

అతడిలోని మార్పును గమనించిన విష్ణుభట్టు, అదే మృదుస్వరంతో భావయుక్తంగా, ఆశువుగా ఒక చక్కని కవిత చెప్పాడు. దాని భావం ఇది:

యమునా సైకత వేదిక మీద కూర్చుని, గోప మురళీధరుడు మృదు మధురంగా మురళీగానం చేస్తున్నాడు. అతడి మురళీనాదానికి యమునానది ఆనందంతోఉప్పొంగి ప్రవహిస్తున్నది. అయితే, యమున ఒడ్డునే వున్న వెదురు పొదలలోని కొన్ని వెదుళ్ళు



గంభీర మనస్కుడైన కమలచంద్ర భూపతిని, ఆ మురళీధరుడు సర్వదా ప్రేమదృష్టితో చూచుగాక!

విష్ణుభట్టు కవిత విని, అప్రయత్నంగా చప్పట్లు చరిచాడు మురళీనాథుడు.

"శభాష్, విష్ణుభట్టా! ప్రకృతి వర్ణనలో నేనే గొప్ప కవినన్న గర్వం, నా మనసులో ఏమూలో వుంటే, అది కూడా ఈనాడు తుడిచి పెట్టుకు పోయిందయ్యా! చాలా చక్కగా చెప్పావు! అద్భుతంగా ఉన్నది!" అంటూ నవ్వుతూ విష్ణుభట్టు భుజం తట్టి మనసారా మెచ్చు కున్నాడు.

విష్ణుభట్టు నమ్రతగా తలవంచి, "ఈ కవిత పుట్టింది మీ కోసమే, బావగారూ!" అన్నాడు.

"అది అర్థమవుతూనే ఉన్నది. అంటే, నా మీద ఈర్ష్యాళువులైన ఇతర కవులు, రాజుకు లేనిపోని మాటలు చెప్పి వుంటా రంటావా?" సాలోచనగా ప్రశ్నించాడు మురళీ నాథుడు.

"అవును, బావగారూ! గంగాభట్టు మొదలైన వాళ్ళంతా, మీమీద ఈర్ష్యగా వున్నారని అక్క చెప్పింది. ఈర్ష్య లేనివాడైతే, నిండు సభలో సాటికవి మీద రాజుకు కలిగిన అనుమానాన్ని బలపరుస్తూ, అలా మాట్లాడతాడా చెప్పండి?" అన్నాడు విష్ణుభట్టు.

"నువ్వు చెబుతున్నది ముమ్మాటికీ నిజమే కావచ్చు! అంతమంది కవి పండితులున్న సభలో, రాజు కటువుగా మాట్లాడే సరికి, ఇక నా మనసుకు ఏదీ తోచలేదు. అయితే రాజును కలిసి, ఇప్పుడు నువ్వు చెప్పిన కవిత ఆయనకు వినిపించమనా, నీ సలహా?" అంటూ ప్రశ్నించాడు.

మాత్రం మురళీనాథుడి చేతిలో ఉన్న, తమ జాతి వెదురుముక్క చేస్తున్న మధురనాదం విని ఈర్ష్యతో కుమిలిపోయాయి. ఎలాగైనా సరే ఆ మురళీధ్వనిని ఆటంకపరిచి, యమున దృష్టిని తమ మీదికి తిప్పుకోవాలన్న వెర్రి కోరికతో, గాలిలో అటూ ఇటూ ఊగుతూ పిచ్చి పిచ్చి శబ్దాలను సృష్టించాయి. ఆ శబ్దాలకు యమున ముందు చిరాకు పడింది. తర్వాత, వెదుళ్ళ ఈర్ష్యాసూయలు గమనించి, వాటి తెలివితక్కువతనానికి నవ్వుకుంది. వెదుళ్ళుచేసిన పిచ్చి శబ్దాలు విన్న తరవాత, మురళీధరుడి మురళీగానం, మరింత మధురంగా తోచింది యమునకు. దాంతో మరింత ఆనందంగా ఒడ్డునున్న మురళీధరుణ్ణి చేరుకోవాలని తపిస్తున్నట్టుగా, పొంగి ప్రవహించటం ప్రారంభించింది. యమునా నదిలా

"అవును, బావగారూ! కాస్త వేషం మార్చి రాజును ఏకాంతంలో కలుసుకుని, ఈ కవిత చెప్పండి. కవిత చివరిలో ఉన్న మాటలవల్ల, మీకు రాజుల పట్ల వ్యతిరేక భావం లేదన్న సమాధానం కూడా స్ఫురిస్తుంది. మిగతా కవులకు మీ పట్ల గల ఈర్ష్యా, మీరు రాజుతో సాన్నిహిత్యాన్ని కోరుకుంటున్న వైనమూ కూడా స్పష్టమవుతాయి," అన్నాడు విష్ణుభట్టు.

విష్ణుభట్టు మాటలకు మురళీనాధుడు వెంటనే అంగీకరించక, సందిగ్ధావస్థలో పడి నట్లు చూశాడు.

విష్ణుభట్టు అతడి సందేహాన్ని గమనించి, వెంటనే, "బావగారూ, మరొక కవి చెప్పిన దాన్ని ఎలా స్వంతంచేసుకోవాలి అని విచా రించకండి. ఈ కవిత మా గోదాదేవిఅక్కకు ప్రాణసమానులైన మీ కోసం, నేను ప్రత్యే కంగా చెప్పినది. మా అక్కను ఎలా స్వీకరిం చారో, అలాగే ఈ కవితాకన్యను కూడా స్వీక రించండి," అంటూ వేడుకున్నాడు.

అయినా, మురళీనాధుడి ఆత్మాభిమానం అందుకు అడ్డుగోడగా నిలిచింది.

తను వేడుకున్నా సరే, మురళీనాధుడు అంగీకరించక పోవటం చూసి, విష్ణుభట్టు నిరాశపడి, అతడిని ఎలా ఒప్పించాలా అని క్షణకాలం ఆలోచనలో పడ్డాడు.

తర్వాత తటపటాయిస్తూనే, తన తలకు చుట్టుకున్న తలపాగానూ, పెట్టుకున్న నూనూగు మీసాలనూ వూడదీశాడు.

మరుక్షణం జలజలమంటూ కిందికి జారిన ఒత్తయిన కేశపాశంతో, చిరునవ్వుతో తన ఎదుట ప్రత్యక్షమైన గోదాదేవిని చూసి తెల్లబోవడం మురళీనాధుడి వంతయింది.



అతడు అప్రయత్నంగా, "గోదా! నువ్వా!" అన్నాడు.

గోదాదేవి చిరునవ్వుతో, "నేనే స్వామీ!" అంటూ క్షణం క్రితం వరకూ మాట్లాడినట్టే పురుషస్వరంతో మాట్లాడి,వెంటనే తన సహజ కోమల స్వరంతో,"నిండుసభలో మీకు అవ మానం జరిగిందనీ, మీరు తలవంచుకుని సభ విడిచి వెళ్ళిపోయారనీ, రాజధాని నుంచి వచ్చిన మా నాన్నగారి శిష్యులు ఇద్దరు చెప్పారు. ఇక నేను అక్కడ క్షణం కూడా వుండలేకపోయాను. నాతో బాటు నాన్నగారు కూడా వచ్చేవారే, కాని నా బలవంతం మీదే ఆగిపోయారు. నాకు నేనుగా వచ్చి ఏ సలహా చెప్పబోయినా, మీరు అంగీకరించ రని భయపడి, ఇలా పురుషవేషం ధరించి వచ్చాను. నిస్సంకోచంగా, ఈ కవిత సహా

యంతో, మీ సమస్య పరిష్కరించుకోండి!" అన్నది.

విభ్రమంగా ఆమె మాటలు వింటూ వుండి పోయిన మురళీనాధుడు, కొద్దిక్షణాల్లో తేరుకుని, అనంగీకారంగా తలాడించాడు.

తాను అంతగా నచ్చచెప్పజూసినా సరే, భర్త అంగీకరించకపోవడం చూసి, గోదాదేవి దుఃఖావేశంతో, "ఏం, ఎందుకని స్వీకరించరు?" అని ప్రశ్నించింది.

మురళీనాధుడు క్షణకాలం మౌనం వహించి, తర్వాత, "స్త్రీల పట్ల చులకన భావం,రాజుల పట్ల వ్యతిరేక భావం, నిండు సభలో అవమానం– ఈ మూడూ నా మనసులో గాఢంగా నాటుకుపోయి ఉన్న దట్టమైన కంటక వృక్షాలు. ఆ మూడింటినీ ఒకే ఒక్క బాణంతో రూపుమాపి, నా మనసులో ప్రకృతి ప్రశాంతతను నింపిన, అపర సత్యభామవు నువ్వు! ఈతరుణంలో, నేను చేయగలిగింది– నా అహంకారాన్ని వదులుకుంటూ, నీకు మనసారా తలవంచడం ఒక్కటే, నీ సత్కృతికి, నీకు చెయ్యవలసిన సరైన ప్రతికృతి!" అంటూ తల వంచి భార్య పాదాలు తాకబోయాడు.

భర్తలో వచ్చిన మార్పుకు, గోదాదేవి జలజలా ఆనంద బాష్పాలు రాలుస్తూ,చప్పున వంగి అతణ్ణి ఆపుతూ, "వద్దు స్వామీ, మీరు నా మాటలకు అంగీకరించారు.అంతే చాలు!" అన్నది.

ఆ తరవాత కొద్దిసేపు, ఆ ప్రాంతపు ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ గడిపిన భార్యాభర్తలు, అక్కడి నుంచి రాజధానికి తిరిగి వచ్చారు.

ఆ మర్నాడే మురళీనాధుడు మారువేషంలో రాజును కలుసుకుని, గోదాదేవి చెప్పిన కవిత చెప్పి, తిరిగి కమలచంద్రుడి అనుగ్రహానికి పాత్రుడయ్యాడు.

ఆ తర్వాత ఒకనాడు, అతడు రాజుకు తన భార్య మారువేషంలో వచ్చి, కవిత్వం చెప్పిన వైనమంతా వివరించి, తన భార్య ఎంత గొప్ప విదుషీమణియో సగర్వంగా తెలియజేశాడు.

అప్పటినుంచీ, మురళీనాధుడు, గోదాదేవి పరిపూర్ణ సహకారం తీసుకుంటూ, ఎన్నో ఉత్తమ కావ్యాలను రచించాడు. ఆ కావ్యాలన్నింటిపైనా మాత్రం, 'విష్ణుభట్టు విరచితమ్' అని రాశాడు.






## 17

[తనను పెళ్ళాడమని వేధించే యువకులలో ఎవడైనా తన భర్త బాణాన్ని ఎక్కు పెట్టి, తన భర్తలాగా పన్నెండు గొడ్డలి తలలగుండా బాణం కొట్టగలిగితే అలాటి మనిషిని పెళ్ళాడడానికి పద్మముఖి నిశ్చయించుకున్నది. ముసలిబిచ్చగాడి రూపంలో వచ్చిన తన భర్తను గుర్తించక, ఆమె ఈ నిశ్చయాన్ని ఆయనతోనే చెప్పేసింది. మర్నాడు ఈ విషయాన్నే ఆమె తన ఇంట పడి తింటున్న వారికి కూడా చెప్పి, రూప ధరుడి విల్లునూ, బాణాలనూ తెచ్చి వారి ఎదుట ఉంచింది.– తరవాత]

ఒక్కొక్కరే వంతు ప్రకారం వచ్చి ధనుస్సుకు నారి సంధించే ప్రయత్నం చేసి ఓడిపోసాగారు. అది చూసి దుర్బుద్ధి కాళుణ్ణి పిలిచి, "ఒరే, ఈ విల్లుకు కొవ్వు రాచి నిప్పు దగ్గిర కాచు!" అన్నాడు. కాళుడు అలాగే చేశాడు. కాని అందువల్ల ఏమాత్రం ప్రయోజనం లేక పోయింది. ఈ విధంగా ధనుస్సుతో దుర్మార్గులు సతమతమవుతూ ఉన్న సమయంలో పందులకాపరీ, పశువుల కాపరీ బయటికి వెళ్ళారు.ఇది గమనించి రూపధరుడు కూడా బయటికి వెళ్ళాడు. అతను వారిని దగ్గరికి పిలిచి రహస్యంగా, "నేను చెప్పేది శ్రద్ధగా వినండి. మీ యజమాని అయిన రూపధరుడు వస్తే మీరు అతనికి ఏమి సహాయం చేస్తారు?ఆ లోపల ఉన్న వాళ్ళందరినీ ఎదిరించి అతని పక్షాన పోరాడతారా? దాపరికం లేకుండా నిజం చెప్పండి," అన్నాడు.

పోరాడతామని ఇద్దరూ ప్రమాణాలూ, శపథాలూ చేసినాక రూపధరుడు వారితో,

గ్రీకు పురాణ గాథ



వెళ్ళి వాళ్ళు తమ గదులలోకి వెళ్లి తలుపులు బిగించుకోవాలనీ, గడబిడ జరిగినా బయటికి రాకూడదనీ హెచ్చరిక చెయ్యాలి. సుఖప్రాప్తీ, నువ్వు బయటికి వెళ్ళి సింహద్వారం బంధించాలి. తెలిసిందా?" అన్నాడు రూపధరుడు.

తరవాత ఆ ముగ్గురూ ఒకరి తరవాత ఒకరుగా లోపలికి వెళ్ళి తమ స్థానాలలో కూచున్నారు. ఈ సమయానికి విపుల యోధుడు ధనుస్సు పైన తన బలం చూపుతున్నాడు. దానిని వంచటం అతనివల్ల కాలేదు. అతను నిరాశతో మూలిగి, "మనం ఎంత దౌర్భాగ్యులం! పెళ్లిమాట అటుంచండి, పెళ్లాడాలంటే ఈవిడ కాకపోతే ఇథకా నిండా ఆడవాళ్లున్నారు. కాని రూపధరుడితో పోల్చితే మనం ఇంత బలహీనులమా అని నాకు విచారంగా ఉన్నది. మన తరంవాళ్లను చూసి రాబోయే తరాల వాళ్లు ఏమనుకుంటారు?" అన్నాడు.

దుర్బుద్ధి ఈ మాటలకు, "చాదస్తంగా మాట్లాడకు. ఇవాళ పర్వదినం. మనం ధనుస్సుల జోలికి పోకూడదు. దాన్ని పెట్టెయ్యి, మరొకనాడు దాని సంగతి చూడవచ్చులే!" అన్నాడు.

ఈ మాట అందరికీ నచ్చింది. అందరూ భోజనాలు ముగించాక రూపధరుడు, "అయ్యలారా, ఆ విల్లు ఒకసారి నా చేతికి ఇప్పిస్తారా? ఇవాళకు మీరు దాని జోలికి పోవటం లేదుగద! నా బలం ఏపాటి అయినదీ చూస్తాను. అయినా, నా బలం ఏనాడో హరించిందిలే!" అన్నాడు.

అందరికీ ఆగ్రహం వచ్చింది. ఆ ముసలివాడు విల్లును వంచుతాడేమోనని వారికి

"నేనే రూపధరుణ్ణి! నేను తిరిగి వచ్చినందుకు సంతోషించే వారు మీరిద్దరే నాకు కనబడుతున్నారు. దేవుడి దయవల్ల నేను నా శత్రువులను నాశనం చెయ్యగలిగితే మీకు గొప్ప బహుమానాలిస్తాను – పొలాలిస్తాను, ఇళ్ళిస్తాను. నేను రూపధరుణ్ణి కాదని అనుమానం ఉంటే ఈ మచ్చ చూడండి!" అంటూ అతను తన కాలిమీది మచ్చ చూపాడు.

ఇద్దరు సేవకులూ తమ యజమానిని చూసి ఆనందబాష్పాలు రాల్చారు.

"ఇప్పుడు సంతోషానికీ, కన్నీరుకూ వ్యవధి లేదు. నేను ముందు లోపలికి పోతాను. తరవాత మీరిద్దరూ ఒక్కొక్కరుగా రండి. నేను విల్లు కోసం అడుగుతాను. వాళ్ళు ఇవ్వరు. అప్పుడు పందులకాపరి ఆ విల్లు తెచ్చి నా చేతికివ్వాలి, తరవాత ఆడవాళ్ళుండే చోటికి

భయం కూడా కలిగింది. దుర్బుద్ధి కోపంతో, "నీచుడా,నీ కేమైనా మతి పోయిందా?సారా తల కెక్కినట్టుందే? నిజంగా నువ్వా ధనుస్సు వంచితే నీ ప్రాణాలు దక్కుతాయనుకు న్నావా?" అన్నాడు.

"దుర్బుద్ధీ, నా కొడుకు తెచ్చిన అతిథికి ధనుస్సు ఎందుకు నిరాకరిస్తున్నావు. ఆయన విల్లు వంచేసి నన్ను పెళ్లాడతానంటాడనా నీ భయం?అలాటి ఉద్దేశం ఆయనకున్నదని ఎందుకనుకోవాలీ?" అన్నది పద్మముఖి కోపంగా.

"మాకలాటి భయమేమీ లేదు, కానీ మేము వంచలేకపోయిన వింటిని ఈ నామరూపాలు లేని ముసలివాడు వంచి గొడ్డలి తలలకుండా బాణం కొట్టాడనుకో, మాకందరికీ ఎంత అవ మానం!" అన్నాడు విపులయోధుడు.

"అమ్మా, నీకీ గొడవలన్నీ దేనికీ? నేనీ విల్లును నా ఇష్టం వచ్చినవాడికి దానం ఇచ్చినా నన్ను అడగగల మగవాడీ దేశంలో లేడు,సరేనా? నువ్వు వెళ్ళి నీ పని చూసుకో!" అన్నాడు ధీరమతి.

ఈ మాటలు పద్మముఖికి ఆశ్చర్యమూ, ఆనందమూకూడా కలిగించాయి.తన కొడుకు సమర్థుడవుతున్నాడని సంతోషిస్తూ ఆమెతన గదికి వెళ్లిపోయింది.

ఈ లోపల పందులకాపరి ధనుస్సును తీసుకుని రూపధరుడి వద్దకు బయలు దేరాడు.ఇది చూసి అందరూ గోలగా అరి చారు. వాళ్ల అరుపులకు పందులకాపరి బెదిరి విల్లు కింద పడేశాడు. కాని ధీరమతి అతన్ని ప్రోత్సహించి, "వాళ్ల వాగుడుతో నీకేమిటి? నీ పని నువ్వు ధైర్యంగా చెయ్యి," అన్నాడు.



పందులకాపరి ధనుస్సు రూపధరుడికిచ్చి స్త్రీలుండే చోటికి వెళ్లి, బహుకీర్తితో, "చిన్న బాబుగారు చెప్పమన్నారు, ఆడవాళ్ళంతా గదుల్లోకి పోయి తలుపులు వేసుకోవాలట; గడబిడ జరిగినా బయటికి రాకూడదట!" అన్నాడు. ఇదంతా ఏమిటో ఆమెకు బోధ పడలేదు,అయినా ఆమె పందులకాపరి చెప్పిన ప్రకారం ఏర్పాటు చేసింది. సుఖప్రాప్తి చల్లగా బయటికి జారుకుని తలవాకిలి బంధించి వచ్చాడు.

ఈలోపుగా రూపధరుడు విల్లును తన చేత పట్టుకుని అటూ ఇటూ తిప్పి పరీక్షిం చాడు. అందరి కళ్ళూ అతనిపైనే ఉన్నాయి. "బాణాల సంగతి తెలిసిన వాడల్లేనే కనబడు తున్నాడు.అటువంటి బాణం చెయ్యాలని చూస్తు న్నాడు లాగుంది. దానికి తాడు తగిలించి



తగ్గలేదు. చీకటి పడబోతున్నది. ఈ పెద్దలకు రాత్రిభోజనం సిద్ధంచేయించు. తరవాత క్రీడావినోదాలూ, నృత్యగానాలూ ఉండనే ఉన్నాయి," అంటూ సైగచేశాడు.

వెంటనే ధీరమతి ఒకచేత కత్తి, ఇంకొక చేత పదునైన ఈటే తీసుకుని తన తండ్రి పక్కనే వచ్చి నిలబడ్డాడు. రూపధరుడు తన చింకిగుడ్డలు తీసి ఎడంగా పారేసి ఒక్క గంతుతో వెళ్లి గడపమీద నిలబడి మిగిలిన బాణాలను తన కాళ్ళవద్ద నేల మీద పరిచి, "అసలు ఆట ఆరంభమయింది. నేనీ సారి ఇంకొక గురి కొట్టబోతున్నాను. ద్దాన్ని ఎవరూ లోగడ కొట్టి ఉండలేదు!" అంటూ బాణం ఎక్కుపెట్టి దుర్బుద్ధికేసి కొట్టాడు.

ఆ బాణం తనకు తగులుతుందని దుర్బుద్ధిగాని, మిగిలినవారుగాని కలలో కూడా ఊహించలేదు. దుర్బుద్ధి పెద్ద కూజాలో ఉన్న సారాయిని రెండు చేతులా ఎత్తి తాగుతూండగా బాణం వచ్చి అతని కంఠంలో గుచ్చుకున్నది. కూజా అతని చేతిలో నుంచి కింద పడింది, అతను పక్కకు పడిపోయాడు.

మరుక్షణం హాహాకారాలు చెలరేగాయి. అందరూ తమ ఆసనాలమీదినుంచి లేచి ఆయుధాలకోసం గోడలకేసి చూశారు. గోడలన్నీ బోడిగా ఉన్నాయి. "మనిషిని కొడతావురా, దుర్మార్గుడా! చూడు నీ ప్రాణాలు తీస్తాం!" అని వారు రంకెలు పెట్టారు.

అప్పటికి కూడా వారు నిజం గ్రహించలేదు. ఆ బిచ్చగాడు ప్రమాదవశాన దుర్బుద్ధిని కొట్టాడనే వారి నమ్మకం.

రూపధరుడు కనుబొమలు ముడేసి వారితో ఇలా అన్నాడు:

బావుకునేదేమిటో బావుకోనీ!" అంటూ వాళ్లు రకరకాలుగా వ్యాఖ్యానించారు.

రూపధరుడు ధనుస్సును పరీక్షించటం పూర్తిచేసి, సునాయాసంగా దానికి తాడు తగిలించి, ధనుస్సును కుడిచేత పట్టుకుని ఎడమచేత తాడు మీటాడు. అది చక్కని నాదం చేసింది. అందరూ దిగ్భ్రమచెందారు. రూపధరుడు ఒక మంచి బాణాన్ని అంబుల పొదినుంచి తీసి ఎక్కుపెట్టి గురిచూసి అన్ని గొడ్డలితలలకుండా దూసుకు పోయేటట్టు కొట్టాడు.

తరవాత అతను తన కొడుకుతో, "నాయనా, ధీరమతీ! నేను నీకు అప్రతిష్ఠ తీసుకురాలేదు. అవలీలగా వింటికి తాడు తగిలించాను, గురిగా బాణం కొట్టాను. ఈ పెద్దమనుషులు ఏమంటే ఏంగాక, నా బలం

"కుక్కల్లారా, నేను ట్రోయ్‌నుంచి తిరిగి రానని ఆశపడ్డారు. ఆ ధైర్యంతోనే మీరు నా ఇంటిపై పడి నా సొత్తంతా తినేశారు, నా దాసీలను మీ సొంతం చేసుకున్నారు, నేను బతికి ఉండగానే నా భార్యను పెళ్లాడ టానికి సిద్ధపడ్డారు. మీకు దైవభీతి లేదు, నా భయమూ లేదు.యమపాశాలు మీ కంఠా లకు తగుల్తుకున్నాయి," అన్నాడు.

భయంతో ఎవరి నోటా మాట రాలేదు. విపులయోధుడు మాత్రం, "నువ్వు నిజంగా రూపధరుడివే అయితే నీ మాటలలో నిజం ఉన్నది. మావల్ల చాలా అక్రమాలు జరిగాయి. వీటికన్నిటికీ మూలకారకుడు దుర్బుద్ధి. వాడు కేవలం భార్యకోసం ఇక్కడికి రాలేదు. నీ కొడుకును చంపి ఆస్తి కాజెయ్యాలనే దుర్బుద్ధితో వచ్చాడు. నీకు నష్టపరిహారం చేస్తాం, తాగిన సారా అంతా ఇచ్చేస్తాం, చందాలు వేసుకుని డబ్బు పోగుచేస్తాం, తలకు ఇరవై ఎద్దుల వంతున ఇచ్చుకుంటాం. నష్ట పరిహారం ముట్టేదాకా నీకు మాపైన ఆగ్రహించే అధికారం ఉన్నది!" అన్నాడు.

"దుర్మార్గులారా, మీరు చేసిన ఆకతాయి తనానికి ఒకటే పరిహారం – మీ ప్రాణాలు. మీలో ప్రతిఒక్కడి ప్రాణాలు పుచ్చుకుంటాను. మీకు పారిపోయే అవకాశం కూడా లేదు," అన్నాడు రూపధరుడు.

విపులయోధుడు తన అనుచరులతో, "అన్నలారా, ఇతను తెగబడ్డాడు. కత్తులు దూసి అందరమూ ఒక్కసారిగా కలియ బడదాం. పట్టండి. ఎంతమందినని చంపగలడు! మనం వీధిలోకి వెళ్లి కేకపెట్టామంటే అందరూ వస్తారు, వీడి ఆట కట్టవుతుంది!" అన్నాడు.

ఇలా అంటూనే అతను కత్తి దూసి ఒక పెడబొబ్బతో రూపధరుడి వేపు లంఘించాడు. మరుక్షణం రూపధరుడి బాణం అతని ఛాతీలో దిగబడిపోయింది.



మిగిలినవాళ్ళుకూడా రూపధరుడిపైకి కలియబడ వచ్చారు. కొందరిని ధీరమతి తన ఈటెతో పడగొట్టాడు. తరవాత అతను తండ్రితో, "నాన్నా,నీకూ పందులకాపరికీ, పశువుల కాపరికీ ఇప్పుడే ఆయుధాలు తీసుకు వస్తాను!" అన్నాడు.

"బాణాలు అయిపోక ముందే పట్టుకురా!" అన్నాడు రూపధరుడు. ధీరమతి సామాన్ల గదికి వెళ్ళి డాళ్ళూ, ఈటెలూ, శిరస్త్రాణాలూ తీసుకుని క్షణంలో తిరిగివచ్చాడు.

వీటిని నలుగురూ ధరించి వాకిలికి అడ్డంగా నిలబడ్డారు.

బాణాలు అయిపోయాక రూపధరుడు విల్లును అవతల పెట్టి, ఈటెలు పట్టాడు. అప్పటికి కొందరు చచ్చారుగాని, ఇంకా కొందరు మిగిలి ఉన్నారు. ఈ సమయానికి కాళుడు తన యజమానులకు సహాయం చేశాడు. వాడు వెనకదారిన వెళ్ళి సామాన్ల గదినుంచి ఈటెలూ, డాళ్ళూ తెచ్చి అందరికీ పంచి పెట్టాడు.

ఈ సంగతి గమనించి రూపధరుడు, "ధీరమతీ, వాళ్ళకు ఇంట్లో దాసీలెవరో సహాయం చేస్తున్నారు!" అన్నాడు.

"తప్పు నాదే, నాన్నా! సామాన్లగది తలుపు తాళం వెయ్యటం తొందరలో మరిచాను!" అంటూ ధీరమతి, పందులకాపరిని వెళ్లి సామాన్లగది మూసిరమ్మని పంపాడు. రెండవ సారి సామాన్లగదిలో ప్రవేశిస్తూ కాళుడు పందుల కాపరికి దొరికిపోయాడు.

తరవాత ఉభయపక్షాలకూ ఈటెలతో యుద్ధం జరిగింది. అదృష్టవశాత్తూ, శత్రువుల ఈటెలలో ఒక్కటికూడా రూపధరుడికిగాని, ధీరమతికిగాని తగలలేదు. కాని వారి ఈటెలకు శత్రువులు పడిపోయారు. ఈటెలు అయిపోయాక దొమ్మి యుద్ధానికి తలపడ్డారు.

ఆ రోజు దేవతలు రూపధరుడి పక్షాన ఉన్నారు. అతని శత్రువులందరూ చివరకు చచ్చారు. ఇద్దరినిమాత్రం అతడు ప్రాణాలతో వదిలిపెట్టాడు; వారు అమాయకులు.

విశాలమైన గది అంతా పీనుగు పెంటలతో నిండి పోయింది. రూపధరుడు ముసలిదాదిని పిలిచి, "దాసీల చేత ఈ గది అంతా కడిగి శుభ్రంచేయించు. ఈ శవాలన్నిటినీ బయటి ఆవరణలో చేర్చమని నౌకర్లకు చెప్పు," అన్నాడు. గది శుభ్రంగా కడిగినాక ధూపం వేయించాడు. – (వచ్చే సంచికలో ముగింపు)






# విష్ణుమాయ

ధ్రువుడు తీవ్రమైన తపస్సు చేసేప్పుడు, ఇంద్రుడు అతని తపస్సు భగ్నం చెయ్యగోరి విరథుడనేగంధర్వణ్ణి పంపాడు. రాక్షస రూపంలో వచ్చి భయపెడుతూన్న విరథుణ్ణి చూసి, ఒక ముని కోపగించి, "నువ్వు నిజంగానే రాక్షసుడివి అయిపో," అని శపించాడు.

ఆవిధంగా విరథుడు తన దేవత్వాన్ని కోల్పోయి, శబరీనదీ తీరాన్ని అంటిపెట్టుకుని, దొరికిన మనుషులను చంపి తింటూ రాక్షస జీవితం గడపసాగాడు. అన్ని విధాలా విరథుడు రాక్షసుడే గాని, అతనికి దివ్యదృష్టి మాత్రం ఉండేది. మూడు లోకాలలోనూ ఎక్కడ ఏమి జరిగేదీ అతనికి తెలిసేది.

శబరీ గోదావరీ సంగమం వద్ద ఒక ఆశ్రమంలో కొందరు మునులుండేవారు. అక్కడి మునిబాలకులు కొందరు, ఒకనాడు అడవిలో సమిథలు ఏరడానికి వచ్చారు. ఆసమయంలో విరథుడు అక్కడికి వచ్చాడు. వాణ్ణి చూడగానే మునిబాలకులందరూ భయపడి పారి పోయారు. కాని భరతుడనేకుర్రవాడు మాత్రం ధైర్యంగా నిలబడ్డాడు. ఆ కుర్రవాడి ధైర్యం విరథుణ్ణి ఆశ్చర్యపరిచింది.

పారిపోయిన మునిబాలకులు, భరతుడి తండ్రితో, "మీ వాడు రాక్షసుడికి దొరికిపోయాడు," అని చెప్పారు. భరతుడి తండ్రి పరిగెత్తుకుంటూ వచ్చి, తనకొడుకును వశపరచుకున్న విరథుణ్ణి చూసి, "నాకు వాడొక్కడే కొడుకు. కావాలంటే నన్ను భక్షించి, వాణ్ణి, విడిచిపెట్టు," అని బతిమాలుకున్నాడు.

"అలాగా! అయితే నీకు ఒక అవకాశం ఇస్తాను. రేపు ఉదయం మళ్ళీ వస్తాను. ఈ లోపల నీ కొడుకును నేను తెలుసుకోలేని చోటదాచు. మరెన్నడూ వాడి జోలికి రాను," అన్నాడు విరథుడు.

భరతుణ్ణి అతని తండ్రి ఆశ్రమానికి తీసుకుపోయి, తన కొడుకును రక్షించుకోవ

టానికి తన తపశ్శక్తి యావత్తూ ధారపోయ సంకల్పించి, హోమంచేసి, బ్రహ్మను ప్రార్థించాడు. బహ్మ అతడికి ప్రత్యక్షమయ్యాడు.

"నా కొడుకును రాక్షసుడి కంటపడకుండా రేపు ఉదయందాకాదాచివాడిప్రాణాలుకాపాడు," అని భరతుడి తండ్రి బ్రహ్మను వేడుకున్నాడు.

బ్రహ్మదేవుడు భరతుణ్ణి తన లోకానికి తీసుకుపోయి,తన ఆసనమైన పద్మంలో ఒక రేకుగా మార్చాడు.

మర్నాడు ఉదయం విరథుడు వచ్చి భరతుడి తండ్రితో, "మూర్ఖుడా, నీ కొడుకును బ్రహ్మదేవుడు తన ఆసనంలోని పద్మంలో ఒక రేకు కింద మార్చి దాస్తే నేను కనుక్కోలేననుకున్నావా? ఈ సారి ఓడిపోయావు. నీకు మరొక అవకాశం ఇస్తున్నాను. ఈ సారిమరింత బాగా నీ కొడుకును దాచు. రేపు ఉదయం మళ్ళీవస్తాను,"అని వెళ్ళిపోయాడు.

ఈసారి భరతుడి తండ్రి శంకరుణ్ణి ప్రార్థించాడు. శంకరుడు ప్రత్యక్షమయ్యాడు. బ్రహ్మను వేడుకున్నట్టే శంకరుణ్ణి కూడా వేడుకున్నాడు, భరతుడి తండ్రి. శంకరుడు భరతుణ్ణి కైలాసానికి తీసుకుపోయి, ఒక కలువ పువ్వుగా మార్చి, పార్వతి చెవిలో అమర్చాడు.

విరథుడు మర్నాడు ఉదయం వచ్చి," నీ కొడుకు కైలాసంలోపార్వతీదేవి చెవిలో కలువ పువ్వు రూపంలో దాగి ఉన్నాడు. నేను తెలుసుకున్నాను.వాణ్ణి దాచటానికింకా ఒక్క అవకాశం ఇస్తున్నాను.ఇదేఆఖరిది,"అంటూవెళ్ళిపోయాడు.

ఆరోజు భరతుడితండ్రి విష్ణువును ఆరాధించి, ప్రత్యక్షంచేసుకుని, బ్రహ్మనూ, శంకరుణ్ణీ కోరినట్టే విష్ణువును కూడా అర్థించాడు.విష్ణువు భరతుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు విరథుడు వచ్చాడు. అతడుతన సూక్ష్మదృష్టితో మూడు లోకాలూ గాలించాడు, కానిభరతుడుఎక్కడ ఉన్నదీ తెలియ రాలేదు. అతను ఆవేశంతో, "మునిబాలకా, ఎక్కడ ఉన్నావురా?" అని అరిచాడు.

"ఇక్కడ ఉన్నాను," అని భరతుడి కంఠం అస్పష్టంగా జవాబిచ్చింది.

"నిన్నేమీ చెయ్యను. నా ఎదటికి రా!" అన్నాడువిరథుడు.వెంటనే విరథుడిగుండెను చీల్చుకుని భరతుడు బయటికి వచ్చాడు. రాక్షసుడు చచ్చి పడిపోయాడు. దానితో విరథుడి శాపం తీరిపోయింది. అతను తిరిగి గంధర్వుడై, భరతుడి తండ్రికి నమస్కరించి, స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు.






# ద్విగుణుడి ఉపవాసం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంతటి నడిరాత్రి వేళ, భూతప్రేతగణం తప్ప మరేదీ నడయాడని ఈ భయంకర శ్మశానంలో, నువ్వు పడుతున్న శ్రమలకు తగిన ఫలితం ఎప్పుడు లభిస్తుందో తెలియడం లేదు. ఒక్కొక్కసారి మనం అనుకోని, ఊహించని మార్గంలో మన కోరికలు నెరవేరడం జరుగుతుంటుంది. ఇలా జరగడానికి కారణాలేమిటో ఎంతటి విజ్ఞుడూ, తాపసీ కూడా తార్కికంగా వివరించలేడు. ఇందుకు ఉదాహరణగా, ద్విగుణుడనే వాడి ఉపవాసం గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

బలభద్రపురంలోని రమానాధుడి ఇంటి పెరట్లో నిధి ఉన్నదని అంతా చెప్పుకునేవారు.

## బేతాళ కథలు



దాని కోసం రమానాథుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు కానీ, జాడ తెలియలేదు.

ఒకసారి అతడింటికి సన్యాసి ఒకడు వచ్చి, "సన్యాసి కాని, ఉత్తముడైన పురుషుడికి నీ ఇంట్లో మూడురోజులు భోజనం పెట్టు. నాలుగో రోజు అతడి చేత కటిక ఉపవాసం చేయించు. అయిదవ రోజు చేతికి గునపం ఇయ్యి. అతడెక్కడ తవ్వితే అక్కడ నీకు నిధి తప్పక దొరికి తీరుతుంది," అని చెప్పాడు.

ఆ రోజునుంచీ కాస్త మంచివాడని తెలిసిన ప్రతివాణ్ణీ, రమానాథుడు తన ఇంటికి ఆహ్వానించ సాగాడు. నిధి దొరికితే వాళ్ళకూ అందులో భాగం ఇస్తానంటే, వాళ్ళల్లో ఒక్కరు కూడా అందుకు అంగీకరించకుండా, పరాయి సొమ్మును ఆశించడం పాపమన్నారు. మంచి మనసుతో అతడింట బస చేసి, మూడు రోజులు సుష్టుగా భోజనం చేసి, నాలుగోరోజున ఉపవాసముండేవారు. అయిదో రోజున వాళ్ళు గునపం పట్టి తవ్వితే, అక్కడ నేలలో చిల్ల పెంకులు కూడా దొరకలేదు. తాము ఉత్తములం కాదని వాళ్ళు చిన్నబుచ్చుకునే వారు. కొందరు సన్యాసి మాటల్లో నిజం లేదనుకునేవారు.

ఏది ఏమైనా– క్రమంగా రమానాథుడి ఆహ్వానం మన్నించి ఇంటికొచ్చే వారి సంఖ్య తగ్గిపోయింది.

కొన్నాళ్ళకు అదే సన్యాసి, మళ్ళీ రమానాథుడి ఇంటికి వచ్చాడు. ఆయనకు రమానాథుడు జరుగుతున్నది చెప్పాడు. అప్పుడు సన్యాసి గంభీరంగా, "నేను నీ అతిథి చేత కటిక ఉపవాసం చేయించడం గురించి చెప్పాను. కటిక ఉపవాసం అంటే ఒక్కరోజుకు పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టకూడదు. అలా చేస్తున్నారా?" అని అడిగాడు.

రమానాథుడు గుర్తు చేసుకున్నాడు. కొందరు పళ్ళు తిన్నారు. కొందరు పాలు తాగారు. అందరూ నీళ్ళు తాగారు. కటిక ఉపవాసం అంటే నిత్యం చేసే భోజనం మానుకోమనే శాస్త్రం చెబుతున్నది. అయితే, ఇప్పుడు సన్యాసి చెప్పాక నిధి కోసం చేయవలసిన కటిక ఉపవాసం గురించి రమానాథుడికి అర్థమై, "స్వామీ! నా నిధి కోసం ఇతరులెవ్వరూ కటిక ఉపవాసం చేయరు. నేనే ఆ పని చేస్తే ఎలా ఉంటుంది?" అని సన్యాసిని అడిగాడు.

"నీ కోసం ఫలాపేక్ష లేకుండా కటిక ఉపవాసం చేయగలిగిన వాడే సత్పురుషుడు. నీ ప్రయోజనం కోసం నువ్వు ఉపవాసం

చేస్తే,అది స్వార్థమవుతుంది తప్ప మంచితనం కాదు. ఇక్కడికి కాస్త దూరంలో చిన్న పట్నముంది. పట్నంలో ద్విగుణుడనే ఆయన ఉన్నాడు. ఆయన్ని పిలుచుకుని రా. ఆయన చేత కటిక ఉపవాసం చేయించావంటే నీ కార్యం నెర వేరుతుంది," అని చెప్పి సన్యాసి వెళ్ళిపోయాడు.

వెంటనే రమానాధుడు ప్రయాణం కట్టి, రోజంతా నడిచి చీకటి పడే సమయానికి చిన్నపట్నం చేరుకున్నాడు. ద్విగుణుడి ఇల్లు అతడికి సులభంగానే దొరికింది. ఆ ఇల్లు చూసి రమానాధుడు ఆశ్చర్యపోయాడు.

ద్విగుణుడు పేదవాడై ఉంటాడని అతడు అనుకున్నాడు. ఇల్లు చూస్తే ఇంద్రభవనంలా ఉంది. లోపలకు వెళితే దాసదాసీ జనంతో మహావైభవంగా వుంది. ద్విగుణుడు వారి మధ్య గొప్ప తేజస్సుతో వెలిగిపోతున్నాడు. ఆయన మంచి పొడగరి. పొడవుకు తగ్గట్టుగా పుష్టిగా వున్నాడు. పట్టువస్త్రాలు ధరించి, వంటినిండా నగలు వేసుకుని, వైష్ణవాలయం లోని దేవుడి విగ్రహంలాగా ధగధగలాడి పోతున్నాడు.

రమానాధుణ్ణి చూస్తూనే ద్విగుణుడు స్వయంగా వచ్చి పలకరించి, వచ్చిన పనే మిటని అడిగాడు. అంత గొప్పవాడికి తను వచ్చిన పని చెప్పడం రమానాధుడికి మొహ మాటంగా తోచింది. అయినా, ద్విగుణుడు బలవంతంగా అతడిచేత మనసులోని మాట చెప్పించాడు.

మాట చెప్పాక ద్విగుణుడేమంటాడోనని రమానాధుడు కలవరపడ్డాడు. కానీ ఆయన ఆప్యాయంగా అతడి భుజం తట్టి, "ఈ రాత్రి కిక్కడ విశ్రాంతి తీసుకో. తెల్లవారగానే బయ




ల్దేరుదాం. ఈలోగా అన్నిఏర్పాట్లూ చేసి వుంచు తాను," అన్నాడు.

రమానాధుడు ఎంతో సంతోషించాడు.

ద్విగుణుడు ఇచ్చిన ఆతిథ్యం వల్ల, రమానాధుడికి వళ్ళు తెలియని నిద్ర పట్టింది. తెల్లవారగానే ద్విగుణుడి సేవకుడు అతణ్ణి నిద్ర లేపి, "త్వరగా తెమలండి. అయ్యగారు తొందర పడుతున్నారు," అన్నాడు.

రమానాధుడు లేచి కూర్చున్నాడు. రాజ వైభోగాలతో అతడి చేత సేవకులు స్నానం చేయించారు. అతడు ద్విగుణుడి గురించి వారినడిగి, విషయం తెలుసుకుని ఆశ్చర్య పోయాడు. వాళ్ళు చెప్పిన ప్రకారం, ద్విగుణుడు సేవకులకు మంచి జీతాలిస్తాడు. కానీ వారిని బాగావేధిస్తాడు. ఎన్నో మంచి పనులు చేస్తాడు. కానీ వ్యసనాలున్నాయి.



"ద్విగుణుడు మంచివాడా, చెడ్డవాడా?" అని అడిగాడు రమానాధుడు ఆత్రంగా.

"ఆయనలో మంచీ, చెడ్డా వున్నాయి. ఎటొచ్చీ చెడ్డను దాచుకోడు. అదొక్కటే విశేషం," అన్నారు సేవకులు.

ఇది విని రమానాధుడు దిగులు పడిపోతూ, "సన్యాసి, ద్విగుణుడి పేరెందుకు చెప్పాడో? ఈయన ఉపవాసం వల్ల నాకు ప్రయోజన ముంటుందో? ఉండదో?" అని పైకే అనేశాడు.

దీనికి సేవకులు నవ్వి, "తను చేయబోయే ఉపవాసం గురించి, మా యజమాని రాత్రి బాగా ప్రచారం చేశాడు. మేమందరం ఆశ్చ ర్యంగా చెప్పుకుంటున్నాం. ఉపవాస దీక్షకు మా యజమాని మీకెక్కడ దొరికాడు? అందరూ మూడుపూటలు తింటే, ఈయన ఆరు పూటలు భోజనం చేస్తాడు. అయనచేత ఉపవాసం చేయించడం ఆ బ్రహ్మతరం కూడా కాదు," అన్నారు.

ఈ మాటలకు రమానాధుడికి దిగులు మరింతగా పెరిగింది. అతడు అన్నింటికీ సన్యాసి మీదే భారం వేసి, ఆలోచించడం మానుకున్నాడు.

కొద్దిసేపట్లో ప్రయాణానికి బండి సిద్ధ మైంది. ఆ బండిలో చాలా మూటలున్నాయి. రమానాధుడు, ద్విగుణుడితో పాటు ఒక వంటవాడు కూడా ఉన్నాడు. ద్విగుణుడు, వంటవాణ్ణి రమానాధుడికి చూపి, "నేను భోజన ప్రియుణ్ణి. వీడి వంటలు తప్ప నాకింకేమీ నచ్చవు. నేనెక్కడికి వెళ్ళినా, నాతో పాటు వీడూ బయల్దేరాల్సిందే," అన్నాడు.

ఆ వెంటనే ప్రయాణం మొదలైంది. దారిలో వంటవాడు పెట్టగా రమానాధుడు, ద్విగుణుడు ఫలహారాలుచేశారు. తను తిన్నదానికి ద్విగుణుడు రెట్టింపు తిన్నాడు. అతడి తిండి పుష్టికి రమా నాధుడు ఆశ్చర్యపోయాడు. కానీ కాసేపాగి ద్విగు ణుడు మళ్ళీ ఫలహారం చేశాడు.

బండి కొంతదూరం వెళ్ళాక, వాళ్ళకు ఆ దారినే వెళుతున్న ఒక మనిషి కనిపించాడు. ద్విగుణుడు బండి ఆపించి, వాణ్ణి పలకరిం చాడు. ఆ మనిషి భార్యకు జబ్బుగా ఉంది. వైద్యుడేవో మూలికలు తెమ్మంటే పొరుగూరు వెళుతున్నాడు. ద్విగుణుడు, వాడి పరిస్థితికి జాలిపడి, ధైర్యం చెప్పాడు.

"కాస్త బండిలో ఎక్కించుకుంటే తొందరగా పొరుగూరు చేరుకుంటాను. నా భార్యకు ప్రాణ ప్రమాదం లేదు కానీ, చాలా బాధపడుతున్నది. వెంటనే ఉపశమనం కలిగించాలని నా ఆశ," అన్నాడు వాడు.

"ప్రాణప్రమాదం లేదు కదా!శరీర బాధం టావా- అనుభవించక తప్పదు. ఉత్తపుణ్యా నికి అయిదేళ్ళ వాడైన నా కొడుకును వెన్న దొంగిలించాడని అనుమానించి, వాతలు పడేలా కొట్టింది నీ భార్య.అందుకే అనుభవి స్తున్నది. అనుభవించనీ," అంటూ వాడిని బండె క్కించుకోకుండానే, ద్విగుణుడు ముందుకు సాగిపోయాడు.

అతడి ప్రవర్తనకు రమానాధుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

అలా మరికొంత దూరం వెళ్ళాక, వాళ్ళకు దారి పక్కగా చెట్టు కింద కూర్చుని ఏడుస్తున్న మనిషొకడు కనిపించాడు. ద్విగుణుడు బండి ఆపించి దిగి వెళ్ళి వాడిని చూస్తూ, "నువ్వు నరసింహం కదూ! ఇక్కడ కూర్చుని ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడిగాడు.

నరసింహం ముక్కు చీదుకుంటూ, "మా అయ్య ముసలయ్య పోయి నాలుగు రోజు లైంది. ఎక్కడ ఏ పని చేద్దామన్నా, ఆయనే గుర్తుకొస్తున్నాడు. దుఃఖం భరించలేకపోతు న్నాను," అన్నాడు.

"అయ్యో! ముసలయ్య పోయాడా? ఎన్నో సార్లు నా చిన్నప్పుడు పొలంలో తాటి ముంజ కాయలు, నా కోసం దింపించేవాడు," అంటూ ద్విగుణుడు తనూ భోరున ఏడ్చాడు.

నరసింహం దిమ్మెరపోయి, తన ఏడుపు మాని ద్విగుణుణ్ణి ఓదార్చసాగాడు. అయితే, ద్విగుణుడు అంతలో పకపకా నవ్వి, "మీ నాన్న దుష్టుడు. బ్రతికినంత కాలం మోసాలే చేశాడు. పొలంలో పనివాళ్ళ కడుపు కొట్టాడు. అన్యాయంగా నాదొక ఎకరం పొలం, తన పొలంలో కలుపుకున్నాడు. అలాంటి దుష్టుడు



పోతే సంతోషించాలి కానీ ఏడ్వడమెందుకు?" అంటూ బండెక్కాడు.

ద్విగుణుడి మాటల్లో నిజమైతే ఉండవచ్చు కానీ, ఆయనలా నిష్టూరంగా మాట్లాడటం రమానాధుడికి నచ్చ లేదు. ఆ తర్వాత మధ్యాహ్నం కాగానే ద్విగుణుడు బండినొక చోట ఆపించి, సుష్టుగా భోంచేశాడు. బాగుం డదని రమానాధుడూ కొంత తిన్నాడు.

"ఇక్కడ కాస్సేపు విశ్రాంతి తీసుకుందాం. ఒక గంట అయ్యాక నాకు మళ్ళీ ఆకలి వేస్తుంది. అప్పుడు మళ్ళీ భోంచేసి బయల్దే రుదాం," అన్నాడు ద్విగుణుడు.

"ఇదేం ఆకలిరా బాబూ!" అనుకున్నాడు రమానాధుడు. ద్విగుణుడు మళ్ళీ భోంచేశాక, వాళ్ళు ప్రయాణం ప్రారంభించి, సాయంత్రా నికల్లా రమానాధుడి ఇల్లు చేరుకున్నారు.



ఆశ్చర్యపోతూండేవారు. ఇలాంటివాడు ఉప వాసమేమి ఉంటాడూ అని, రమానాధుడి కుటుంబంవారంతా అనుమానించారు.

మూడోరోజు రాత్రి పడుకోబోయే ముందు ద్విగుణుడు, రమానాధుడి భార్యను పిలిచి, "అమ్మా! రేపు నేను కటిక ఉపవాసం. పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టను. నీకు విశ్రాంతి," అన్నాడు.

ఆ తర్వాత కాసేపటికి రమానాధుణ్ణి పిలిచి, "నీకు నిధి దొరికితే నాకేమైనా భాగం ఇస్తావా?" అని అడిగాడు.

ఇలాంటి స్వార్థపరుడి వల్ల తనకు నిధి ఏం దొరుకుతుందిలే అనుకుంటూ, "నిధి దొరకాలే కానీ అందులో నాలుగోవంతుమీదే!" అని చెప్పాడు రమానాధుడు.

నాలుగో రోజు వచ్చింది. ద్విగుణుడు కటిక ఉపవాసం వుంటాడనుకున్నాడు రమానాధుడు. కానీ ఆయన తన వంటవాడి చేత మూడు పూటలా శుభ్రంగా వండించుకుని తిన్నాడు. అదేమని అడిగితే, "రోజుకు ఆరు పూటలు తింటాను కదా!మూడు పూటలుమానేస్తే, అదే కటిక ఉపవాసం నాకు," అన్నాడు.

రమానాధుడు కలవరపడ్డాడు. కానీ మర్నాడు ఉదయం ద్విగుణుడు గునపం తీసుకుని పెరట్లో తవ్వగా వెంటనే ఖంగుమన్నది. అక్కడ కొంచెం లోతుతవ్వగా, బంగారు కాసులతో నిండిఉన్న పెద్ద బిందె దొరికింది!

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రమానాధుడు నిధి సంపాదించేందుకు సన్యాసి అతణ్ణి ఒక ఉత్తమ పురుషుడికి మూడు రోజులు భోజనం పెట్టి, నాలుగో రోజున కటిక ఉపవాసం చేయించమన్నాడు గదా!

అప్పటినుంచీ ద్విగుణుడు ఇంట్లో విచిత్రంగా ప్రవర్తిస్తూనే ఉన్నాడు. ముందు రమానాధుడి భార్య అందాన్ని మెచ్చుకున్నాడు. తర్వాత, మనిషి అందంగా ఉన్నా, ఇల్లు అందంగా ఉంచలేదని చిన్నబుచ్చాడు. రమానాధుడి పిల్లలు ముచ్చటగా వున్నారని అన్న కాసేపటికే, అల్లరెక్కువని విసుక్కున్నాడు. రమానాధుడికి నిధి దొరుకుతుందని కాసేపు సంతోషించి, అతడి కోసం తన వైభవాలన్నీ వదులుకు రావలసి వచ్చిందని చిరాకు పడ్డాడు.

ఆ రోజు గడిచింది. తరవాత మూడు రోజుల పాటు ద్విగుణుడు, రమానాధుడి ఇంట్లో సుష్టుగా భోజనం చేశాడు. రోజుకు ఆరు పూటలు అంతగా భోంచేసేవాణ్ణి ఎక్కడా చూసి ఉండనందున, ఇంటిల్లిపాదీ

అయినా, ద్విగుణుడు అలా కటిక ఉపవాసం చేయకపోయినా, అతడి వల్ల రమానాధుడికి నిధి దొరికింది. పైగా, ద్విగుణుడి ప్రవర్తన చూస్తే, అతడిలో ఉత్తమ పురుషుడిలో ఉండదగ్గ మంచి లక్షణాలేమీ లేవు. చావు బతుకుల్లో వున్న భార్య గురించి విచార పడుతున్న వాడికి సానుభూతి చూపకపోగా, వాణ్ణి తిట్టాడు. అలాగే, తండ్రి పోయిన దుఃఖంలో ఉన్న నరసింహాన్ని, నాలుగు మంచిమాటలతో పరామర్శించకపోగా, నానా దుర్భాషలాడాడు. దొరకబోయే నిధిలో రమానాధుణ్ణి భాగమడిగాడు. ఇదంతా చూస్తే, అనుకోని, ఊహించని రీతిలో, ఏదో కాకతాళీయంగా రమానాధుడికి నిధి దొరికిందనుకోవాలే తప్ప, ఇందులో ద్విగుణుడి ఉత్తమ పురుష లక్షణాల ప్రమేయం వున్నదనుకోవడం పొరబాటవుతుంది గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "లోకంలో ఎక్కడా సంపూర్ణ ఉత్తమపురుషుడంటూ ఉండడు. ఉత్తముడైనవాడు చెడ్డతనాన్ని తనలో దాచిపెట్టి ఉంచడం వల్ల, అతడి ఉత్తమ స్థితికి గ్రహణం పడుతుంది. ద్విగుణుడు తనలోని మంచినీ, చెడ్డనూ విడదీశాడు. అందువల్ల, అతడి మంచిచెడ్డలు అందరికీ స్పష్టంగా కనిపించినై. అతడిలో రెండు వ్యక్తిత్వాలుండడం వల్ల, రోజుకు ఆరు పూటలు భోజనం చేస్తాడు. తనలోని మంచితనంతో ఇతరులకు సాయపడతాడు. చెడ్డతనంతో ఇతరులను ద్వేషిస్తాడు. స్వార్థం చూపిస్తాడు. ఎంతో వైభవముండీ, రమానాధుడికి సాయపడాలని వచ్చాడు. అతడిలోని మంచివాడు, రమానాధుడి భార్య పెట్టింది తిన్నాడు. చెడ్డవాడు అహంకరించి, తన వంటవాడి చేత వండించుకుని తిన్నాడు. అతడిలోని ఉత్తముడు ఒక రోజంతా కటిక ఉపవాసం చేశాడు. అందువల్లనే అతడి సాయం రమానాధుడు నిధి సంపాయించేందుకు ఉపకరించింది. ఈ కారణాల వల్ల, నిధి దొరకడం ఏదో కాకతాళీయం అనుకోవడం సరికాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]



# సాష్టాంగ నమస్కారం

ఒకసారి సముద్రతీర ప్రాంతంలో వున్న ఉల్లిపాలెం అనే గ్రామం, పెద్ద తుఫాను తాకిడికి గురవడంతో, గ్రామంలోని చాలా ఇళ్ళు దెబ్బతిన్నవి. సాంబుడనే పేద రైతు, ఇంటి మరమ్మతు కోసం, ఇరుగు పొరుగుల్ని సాయమడిగాడు. వాళ్ళు సాంబుణ్ణి, గ్రామంలోని వడ్డీ వ్యాపారి చింతన్న దగ్గరకు వెళ్ళమన్నారు.

సాంబుడు, చింతన్న దగ్గరకు వెళ్ళి, వచ్చిన పని చెప్పి వెయ్యి రూపాయలు అప్పడిగాడు. చింతన్న వాణ్ణి ఎగాదిగా చూసి, 'ఓహో, నువ్వు సాంబుడివి గదా, నన్నెరుగుదువన్నమాట!" అన్నాడు వేళాకోళంగా.

"అయ్యా, గ్రామంలో తమనెరుగని వాళ్ళుంటారా!" అన్నాడు సాంబుడు.

"ఏమో, నన్నెరగవేమో అనుకున్నాను. నేను వీధిలో ఎదురైనా, చెరువు గట్టున కనిపించినా– ఏనాడైనా నమస్కరించావా? నువ్వు పొగరుబోతువు," అన్నాడు చింతన్న కోపంగా.

"అది నేనెరక్క చేసిన తప్పు!" అంటూ సాంబుడు, చింతన్నకు నమస్కరించాడు.

"నాకు నువ్వు నమస్కారం పెట్టడానికి, ఒక తుఫాను అవసరమయిందన్న మాట!" అంటూ చింతన్న నవ్వి, "ఇలాంటి నమస్కారాలు గ్రామంలో అందరూ నాకు చేస్తారు. నీ పొగరణుగుతుంది. సాష్టాంగనమస్కారం చెయ్యి," అన్నాడు.

సాంబుడలాగే చేసి, చింతన్న ఇచ్చిన డబ్బు తీసుకుని వెళుతుండగా, దూరాన చెట్టుకింద నిలబడి ఇదంతా చూసిన వీరయ్య అనేవాడు, వాణ్ణి ఆపి, "అప్పు కోసం చింతన్నకు సాష్టాంగ పడతావా? ఛీ!ఛీ!" అన్నాడు.

దానికి సాంబుడు తాపీగా, "ఈ అప్పు చింతన్న వసూలు చేసుకునే లోపల, అతని చేత ఒకటి కాదు, నాలుగు సాష్టాంగ నమస్కారాలు చేయించుకుంటాను. నువ్వే చూద్దువు గాని!" అన్నాడు. – కోటంరాజురమాపతి



# భారతదేశపు పగడాల దీవులు

రచన : మీరానాయర్ ◆ చిత్రాలు: అరిత్రా




కేరళ రాష్ట్రం కొచ్చిన్‌కు రెండువందల నుంచి నాలుగు వందల కి.మీ దూరంలో లక్షద్వీప్ దీవులు ఉన్నాయి. మన దేశంలో ఇక్కడ మాత్రమే పగడాల దీవులు ఉన్నాయి.

లక్షద్వీప్ 36 చిన్న దీవుల సమూహం. ఇది 1956వ సం॥ లో మన దేశంలోని అతి చిన్న కేంద్రపాలిత ప్రాంతం అయింది. 1974వ సం॥లోనే దీనికి లక్షద్వీప్ అని పేరు పెట్టారు. అంత వరకు దీనిని లక్కదీవులనీ, అమినీ ద్వీపమనీ, మినికాయ్‌దీవులనీ పిలిచేవారు.

మొత్తం 36 దీవులలో 10 దీవులలో మాత్రమే ప్రజలు నివసిస్తున్నారు. అమినీ, ఆండ్రాట్, అగాట్టి, బిత్ర, చెట్లాట్, కడ్మట్, కల్పేని, కావరట్టి, కిల్టాన్, మినికాయ్ అనేవే ఈ పది దీవులు.

కేరళ ప్రాంతంనుంచే ఈ దీవులకు ప్రజలు మొట్టమొదట వెళ్ళి స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. కేరళను పరిపాలించిన చిట్టచివరి రాజు చేరమాన్ పెరుమాళ్, ఇస్లాం మతాన్ని స్వీకరించి, మెక్కాకు వెళ్ళిపోయాడని చెబుతారు. అతన్ని ఒప్పించి మళ్ళీ స్వదేశానికి పిలుచుకురమ్మని, కన్ననూర్ రాజా– కొందరు సైనికులను పంపాడు. ఆ సైనికులు వెళ్ళిన ఓడ మార్గమధ్యంలో పెద్దబండకు ఢీకొనడం వల్ల, వాళ్ళు ముందుకు వెళ్ళలేక వెనుదిరగవలసి వచ్చింది.

సైనికులు తిరుగుప్రయాణంలో, మార్గమధ్యంలో చాలా దీవులను చూసినట్టు కన్ననూర్ రాజాకు తెలియజేశారు. ఆ దీవులకు వెళ్ళి, నివాసం ఏర్పరచుకుని వ్యవసాయం చేయదలచుకున్నవారు ఆ భూములను సొంతం చేసుకోవచ్చునని రాజు ప్రకటించాడు. ఆ విధంగా అక్కడికి కేరళ ప్రజలు వెళ్ళి స్థిరపడడం ప్రారంభమయిందని చెబుతారు.

వాళ్ళు మొట్టమొదట అమినీ దీవికి వెళ్ళారు. అది 3 కి.మీ. పొడవూ, 1.6 కి.మీ వెడల్పూ కలిగిన దీవి.

తాబేటిచిప్పలతో, కొబ్బరి చిప్పలతో అందమైన చేతికర్రలు తయారుచేయడంలో అమినీదీవి హస్తకళాకారులు సిద్ధహస్తులు. పగడాల మీద, రాతిచెక్కల మీద అందమైన బొమ్మలు చెక్కడంలో అమినీ శిల్పకారుల నైపుణ్యం ప్రసిద్ధమైనది.

లక్షద్వీప్ పశ్చిమాగ్రంలో ఉన్న అగాట్టిదీవి ఎక్కువ ఉష్ణోగ్రత గల దీవి. 1988వ



ఆండ్రాట్ పడవవాడు


కావరట్టి, ఉజ్రా మసీదు

సం॥లో ప్రధాన భూభాగం నుంచి ఇక్కడికి వాయుదూత్ విమానం వచ్చి వెళ్ళడంతో, ఇది వాయుయానపటంలో కూడా చోటు సంపాయించుకున్నది.

అమినీకి ఆగ్నేయదిశలో ఉన్న ఆంద్రాట్ దీవి ప్రజలు మొదట ఇస్లాం మతం పుచ్చుకున్నారు. లక్షద్వీప్‌లో ఇప్పుడున్న దాదాపు 51,680 మంది జనాభాలో 94 శాతం మంది ముస్లింలే.

ప్రవక్త మహమ్మదు – హజ్రత్ ఉబేయ్‌దుల్లా అనే ఆరబ్ సాధువు కలలో కనిపించి, ఇస్లాం మతాన్ని దూరతీరాలలో వ్యాపింపజేయమని ఆజ్ఞాపించాడట.

ప్రవక్త ఆజ్ఞ ప్రకారం హజ్రత్ ఓడలో బయలుదేరాడు. కాని ఓడ, తుఫానులో చిక్కుకుని తల్లకిందులయింది. ఆఖరికి ఆయన ఒక విరిగిపోయిన కొయ్యపలక మీద అమినీ దీవిని చేరుకున్నాడని చెబుతారు.

అమినీ దీవి ప్రజలను ఇస్లాం మతానికి మార్చడంలో ఆయన కృతకృత్యుడు కాలేకపోయాడు. అక్కడి నుంచి దాపులనున్న ఆంద్రాట్, కావరట్టి, కల్పేని దీవులలో తన ప్రచారాన్ని సాగించి, క్రమంగా విజయం పొందాడు. ఆయన ఆంద్రాట్‌లోనే మరణించాడు. ఆయన సమాధిని జుమ్మా మసీదులో భద్రపరచి ఉన్నారు.

లక్షద్వీప్‌లోకెల్లా పెద్ద దీవి ఆంద్రాట్. ఈ దీవి అంతా కొబ్బరి చెట్లమయంగా ఉన్నది. ఇదే ఈ దీవులకు మేలురకం కొబ్బరిని సరఫరా చేస్తున్నది.

లక్షద్వీప్ రాజధాని కావరట్టి– అమినీ, ఆంద్రాట్ దీవుల మధ్య ఉన్నది. ఇది 6 కి.మీ పొడవూ, 1 కి.మీ వెడల్పూ కలిగిన దీవి. ఇది బాగా అభివృద్ధి చెందిన ద్వీపం. లక్షద్వీప్‌కు చెందని ప్రజలు ఇక్కడే ఎక్కువ శాతం నివసిస్తున్నారు. ప్రభుత్వ కార్యాలయాలూ, అధికారుల నివాసగృహాలూ ఇక్కడే ఉన్నాయి.


తేలికచెక్కల నగిషీ పనులతో నిండిన ఉజ్రా మసీదు పైకప్పు

కావరట్టి శిల్ప కళాకారులు నైపుణ్యానికి పేరుగాంచారు. ఉజ్రా మసీదు వారి ప్రతిభకు తార్కాణంగా ఉంటున్నది. ఈ కేంద్రపాలిత ప్రాంతంలో ఉన్న 52 మసీదులలో ఇది చాలా ఆకర్షణీయమైనది. దీనిని 1670వ సం॥లో నిర్మించారు.

మసీదు పైకప్పును దుంగలుగా నీళ్ళలో కొట్టుకు వచ్చిన తేలిక కలపతో నిర్మించారు. అందంగా మలచబడిన దాని మీద ఎరుపు, పచ్చరంగులు పూయబడి ఉన్నాయి. ఇక్కడ ఉన్న బావినీటికి రోగాలను నయం చేసే గుణం ఉన్నదని విశ్వసిస్తారు.

కావరట్టికి దక్షిణంగా కల్పేని ఉన్నది. అరబ్ రచయితలు దీనిని కోల్పైనీ అని పిలిచారు. ఇది అరేబియాకు వెళ్ళే మార్గంలో ఉన్నది. కల్పేని చుట్టూ బ్రహ్మాండమైన సరస్సు ఉన్నది. ఇందులోనే – చెర్యమ్, టియలక్కమ్, పిట్టీ అనే మూడు చిన్నదీవులు ఉన్నాయి.

పిట్టీని పక్షి పిట్టీ అనికూడా అంటారు. ఇదిచాలా ఆసక్తికరమైన చిన్న రాతిదీవి. ఈ దీవిని చేరుకోవాలంటే కనీసం ఆఖరి50మీ. ఈదుకుంటూనే వెళ్ళాలి. అందువల్ల ఇదొక సాహసయాత్ర అనే చెప్పవచ్చు. ఇక్కడ గడ్డిపోచ కూడా పెరగదు. ఇక్కడ ఉన్న వన్నీ వేనవేలసంఖ్యలో సముద్రపక్షులు.వీటిలో రీవ (టెర్న్) పక్షులు అధికసంఖ్యలో ఉన్నాయి.ఈ తీరాన్ని సమీపిస్తున్నప్పుడే ఈ పక్షుల కిలకిలారావాలు వినిపిస్తాయి.

కొన్ని రకాల రీవపక్షులు ఇక్కడే గుడ్లు పెట్టి పొదుగుతాయి. ఇవి ఇసుకలోనూ, రాళ్ళలోనూ కట్టే గూళ్ళు అందంగా ఉంటాయి. అక్కడ దొరికే రంగురంగుల గుల్లపెంకులతో గూళ్ళను అలంకరిస్తాయి. వీటి గుడ్లు కోడిగుడ్లలాగా ఉంటాయి కాని, వాటి మీద నలుపు ఊదారంగు మచ్చలు ఉంటాయి. అమినీ, ఆండ్రాట్ ద్వీపవాసులు ఈ గుడ్లను ఇష్టంగా తింటారు. ఇటీవల ప్రభుత్వం పిట్టీని పక్షుల శరణాలయంగా ప్రకటించేంతవరకు, వాళ్ళు రోజు తప్పకుండా వాటి గుడ్ల కోసంఅక్కడికి వెళ్ళేవాళ్ళు.

చేపలు పట్టేవాళ్ళకు రీవపక్షులు చాలా ఉపయోగపడతాయి. ఇవీ, టూనా చేపలు చిన్న చిన్న చేపలను పట్టి తింటాయి. ఇవి ఉన్నచోట ఎక్కువగా చేపలు ఉంటాయని మత్స్యకారులకు తెలిసిపోతుంది.

లక్షద్వీప్ దక్షిణాగ్రంలో ఉన్న దీవి మినికాయ్. ఇక్కడి పగడాల సరస్సు చిన్న ఓడలు ప్రవేశించడానికి తగినంత వైశాల్యమూ, లోతూ కలిగి ఉన్నది.

మినికాయ్ దీవిలోని పురుషులందరూ చేపలు పట్టడానికి వెళ్ళడం వల్ల అక్కడ స్త్రీలే ఎక్కువగా కనిపించడంతో – 13వ శతాబ్దానికి చెందిన యాత్రికుడు మార్కోపోలో దీనిని 'ఆడదీవి' అని చెప్పాడు. ఆ పరిస్థితి ఇప్పటికీ అంతగా మారలేదు.

పురుషులు చాలామంది చేపలు పట్టడానికీ, ఓడలలో పనిచేయడానికీ వెళతారు. అందువల్ల దీవిలోని పనులన్నిటినీ అంటే – కార్యాలయాల వ్యవహారాల నుంచి, శారీరక శ్రమ ప్రధానంగా గల అన్ని పనులనూ స్త్రీలే చూసుకుంటారు.



పిట్టీ దీవిలోని(నాడీ టెర్న్) రీవపక్షులు

మినికాయ్ ప్రజల వేషభాషలు మిగతా వారికన్నా భిన్నంగా ఉన్నాయి.

ఇక్కడి పురుషులు జీన్స్, టీ షర్ట్స్ ధరిస్తారు. స్త్రీలు పొడవాటి ఎర్రటి లుంగీలు ధరిస్తారు. మెడ చుట్టూ అందమైన అల్లికలు చేసుకుంటారు. తల చుట్టూ తెల్లబట్టను, లేదా నల్లబట్టను చుట్టుకుంటారు. అప్పుడే నడక ప్రారంభించిన ఆడపిల్లలు కూడా తలకు రుమాలును చుట్టుకుంటారు.

ఇతర దీవులలో పురుషులు లుంగీలు ధరిస్తారు. స్త్రీలు బిగువైన రవికలు, నడుముకు పావడలాంటి 'కచ్చి' ధరిస్తారు.

మినికాయ్ ద్వీపవాసులు మాహీభాష మాట్లాడతారు. మిగతా దీవులలో మలయాళమే ప్రధానభాష. ఇతర దీవుల ప్రజల లాగా కాకుండా, ఈ దీవి ప్రజలు గుజరాత్ ప్రాంతం నుంచి వచ్చిన వారి సంతతిగా చెబుతారు. వీరిని 'టక్రుస్' అని అంటారు. అంటే 'ఠాకూర్' అనేమాట ఇలా మార్పుచెంది ఉండవచ్చు. గుజరాత్‌లో లాగే ఇక్కడ కూడా ప్రతి ఇంట్లో ఉయ్యాల మంచం ఉన్నది.



లక్షద్వీప్ స్త్రీలు

వారి సంప్రదాయ నృత్యం 'దండి' గుజరాత్‌కు చెందిన 'దండియారాస్'కు సంబంధించినది.

లక్షద్వీప్‌లోని మిగతా దీవులలోలాగే మినికాయ్‌లో కూడా మాతృస్వామ్య వ్యవస్థ ఆచరణలో ఉన్నది. అంటే ఈ కేంద్రపాలిత ప్రాంతంలోని స్త్రీలు, మన దేశంలోని పలుఇతర ప్రాంతాల స్త్రీల కన్నా, ఉన్నతమైన సామాజిక స్థాయిని అనుభవిస్తున్నారు.



మినికాయ్ దీవిలోని
రావరీల (గీతకారుల) లావా నృత్యం



# నిత్యసంతోషి

విశాలపురంలో చార్వాకుడనే యువకుడు న్నాడు. వాడు కష్టపడి పనిచేసేవాడు. కొత్త విషయాలు ఎవరు చెప్పినా నేర్చుకుంటాడు. ఎవరేమన్నా కోపగించుకోడు. ఎప్పుడూ నవ్వుతూండడంవల్ల, వాడిని అంతా నిత్యసంతోషి అంటూంటారు.

ఇలా వుండగా, ఆ ఊరుకు ప్రారబ్ధుడనే ధనికుడు వచ్చాడు. ఆయనకు పెద్ద జబ్బు చేసి తగ్గింది. వైద్యుడు గాలిమార్పు కోసం ఆయనను కొన్ని మాసాలపాటు విశాలపురంలో గడిపి రమ్మన్నాడు.

ప్రారబ్ధుడు పెద్ద ఇల్లు అద్దెకు తీసుకున్నాడు.ఒక వంటమనిషినీ , సేవకుణ్ణీ ఏర్పాటు చేసుకున్నాడు.రోజూ ఆయనింటికి ఊరి పెద్దలు కొందరు వచ్చి కబుర్లు చెప్పి వెళుతూండేవారు.

కానీ ప్రారబ్ధుడెప్పుడూ దిగులుగా వుండేవాడు. అది గమనించిన ఊరిపెద్ద ఒకడు, "ఈ ఊళ్ళోని చార్వాకుడనే వాడు నిత్యసంతోషి. వాణ్ణి నీ ఇంట్లో పనికి పెట్టుకుంటే,వాణ్ణి చూస్తూ నువ్వూ సంతోషంగా వుండగలవు," అన్నాడు.

ఇందుకు సరేనని ప్రారబ్ధుడు అన్ని వేళలా దగ్గరుండి, తన అవసరాలు చూసేటందుకుగాను చార్వాకుణ్ణి నియమించాడు.

చార్వాకుడు, ప్రారబ్ధుడికి చక్కగా సేవలు చేసేవాడు. ఆయన చేత స్నానం చేయించేవాడు. ఆయన్ను చక్కగా ముస్తాబు చేసేవాడు. ఆయన పక్కమడత నలిగేది కాదు. ఆయన గదిలో ధూళిరేణువు కూడా వుండేది కాదు. చూడవచ్చిన వారందరూ చార్వాకుడి పనితనాన్ని మెచ్చుకున్నారు.

అయితే, ప్రారబ్ధుడి దిగులు మాత్రం పోలేదు. ఆయన ఒకరోజున చార్వాకుడితో, "ఒరేయ్, అష్టయిశ్వర్యాలూ వుండి నేను దిగులుగా వున్నాను. విశ్రాంతి లేకుండా పనిచేస్తూ కూడా నువ్వు నిత్యసంతోషివి. నీ సంతోషానికి రహస్యమేమిట్రా?" అన్నాడు.

రాయపరపు ఆదినారాయణరావు



"ఈ ప్రపంచంలో సంతోషం తప్ప మరొకటున్నదనిపించదు, నాకు. మీరు దిగులుగా వుండడానికి కారణం నాకు తెలియడం లేదు," అన్నాడు చార్వాకుడు.

"చిన్నప్పుడు నాకే దిగులూలేదు. వంద రూపాయల పెట్టుబడితో వ్యాపారం ప్రారంభించి, ఇప్పుడు కోటీశ్వరుణ్ణయ్యాను. నాకు జబ్బు చేసింది. గాలిమార్పు కావాలన్నారు. ఇక్కడికి వచ్చాను. నా వాళ్ళంతా ఇంటి పనులు, వ్యాపారం పనులు చూసుకుంటూ ఒంటరిగా నన్నిక్కడికి పంపారు. అందరుండీ ఎవరూ లేనివాడినయ్యాను. మరి దిగులుగా వుండదా?" అన్నాడు ప్రారబ్ధుడు.

చార్వాకుడునవ్వి, "ఇదిఎంతో సంతోషించాల్సిన విషయం. మీరు దగ్గర లేకున్నా, మీ వాళ్ళు అన్నివ్యవహారాలూ చూసుకోగలుగుతున్నారు. మీకోసం ఎంతైనా ఖర్చుపెట్టగలుగుతున్నారు," అన్నాడు.

"కానీ మా వాళ్ళు నాకు సేవలుచేస్తూంటే ఆ తృప్తి వేరు కదా!" అన్నాడు ప్రారబ్ధుడు.

"తమరు నాకు రోజుకు పదిరూపాయలిస్తున్నారు. మీ వాళ్ళు ఒక్కొక్కరు రోజుకు వెయ్యి రూపాయలు వచ్చే పని చేస్తారు. ఆ విధంగా వాళ్ళు మీకు ఆదా చేస్తున్నారు కదా!" అన్నాడు చార్వాకుడు.

"నా కోసం రోజుకు పది రూపాయల సేవకుడు కాదు, వెయ్యిరూపాయల సేవకులు కావాలి. ఆ కోరిక తీరడం లేదని నాకు దిగులు," అన్నాడు ప్రారబ్ధుడు.

దీనికి చార్వాకుడు పెద్దగానవ్వి, "అయ్యా! ఈ ప్రపంచంలో అతినీచమైనది సేవకవృత్తి. ఏ పనీ చేతకాని వారే దీనికి పాల్పడతారు. ఎవరైనా డబ్బుకోసమే సేవలుచేస్తారు. డబ్బు దగ్గరుంటే సేవలు చేయించుకోవాలనిపిస్తుంది; చేయాలనిపించదు. మీ వంటి వారికి సక్రమంగా సేవలు జరగాలంటే, అవి నాబోటివాళ్ళవల్లే అవుతాయి. సమర్థులైన మీ వాళ్ళకు సేవలు చేయడం రాదు," అన్నాడు.

అప్పుడు ప్రారబ్ధుడు మాట మార్చుతూ, "అతినీచమైన వృత్తిచేస్తూ నువ్వు దిగులుగా వుండవలసింది పోయి, సంతోషంగా ఎలా వుండగల్గుతున్నావు?," అని విషయం చార్వాకుడి మీదకు మళ్ళించాడు.

"ఈ మహాప్రపంచంలో, మా జనాభాయే ఎక్కువమరి. మా సంఖ్యాబలం నాకు సంతోషాన్ని కలిగిస్తుంది," అన్నాడు చార్వాకుడు.

మహాభారతం మహాకావ్యం అది చదవలేదని ప్రారబ్ధుడికి దిగులు. కావ్యపఠనం

తీరుబడివున్న వాళ్ళకోసమనీ, తీరుబడి లేకుండా పనిచేయడమే గొప్ప అదృష్టమనీ, చార్వాకుడిబదులు. ఎవరికీరాని భయంకర వ్యాధి తనకు సోకిందని, ప్రారబ్ధుడికి దిగులు. అంతటివ్యాధీ నయం కావడమేకాక, ప్రారబ్ధుడికి విశ్రాంతినికూడా ప్రసాదించిందని, చార్వాకుడి బదులు.

ఇలా ఏం చెప్పినా చార్వాకుడు మరొక విధంగా బదులిస్తూండడంతో, ప్రారబ్ధుడిలో విసుగు బయల్దేరింది. ఆయన తన దిగులు మరిచిపోవడానికి బదులు, చార్వాకుడి సంతోషానికి అసూయ చెందసాగాడు. చార్వాకుడి నవ్వుముఖం చూస్తూంటే ఆయన దిగులు రెట్టింపయింది. ఒకరోజున ఆయన ఈ విషయం ఊరిపెద్దలకు చెప్పుకున్నాడు.

ఇది విన్న ఒకాయన, "ఇప్పుడు నీకు సంతోషం కలిగే మార్గం సులభమయింది. ప్రతిరోజూ చార్వాకుడిని మనసుకు కష్టం కలిగేలా తిట్టు. వాడి ముఖంలో నవ్వు మాయమైతే, నీ దిగులూ మాయమవుతుంది," అని సలహా ఇచ్చాడు.

అప్పటినుంచీ ప్రారబ్ధుడు, చార్వాకుణ్ణి అకారణంగా తిట్టడం మొదలుపెట్టాడు. అయినా వాడు చలించక పోగా, "ఛీకొట్టినా నీకు సిగ్గులేదు. నువ్వు కుక్కవి," అన్నాడు.

చార్వాకుడు ఎప్పటిలాగే నవ్వి తనపనులు చేసుకునిపోయాడు.

మరొకసారి ప్రారబ్ధుడు వాణ్ణి పంది అన్నాడు. ఇంకొకసారి దున్నపోతు అన్నాడు. మరొకసారి గాడిద అన్నాడు. అయినా చార్వాకుడు నవ్వుతూంటే, "నాతిట్లు నీకు సంతోషాన్నెలాకలిగిస్తున్నాయి?" అని ప్రశ్నించాడు.



"కుక్క విశ్వాసానికి మారుపేరు. పంది దశావతారాల్లో ఒకటి. దున్నపోతు, గాడిద సేవాధర్మంలో సాటిలేనివి. మీరు నన్ను పొగిడినట్లే అనిపించిది నాకు. పొగడ్తలకు సంతోషించడం మానవధర్మం," అన్నాడు చార్వాకుడు నవ్వుతూ.

ప్రారబ్ధుడికి బాగా ఉక్రోషం వచ్చింది. ఎలాగైనా చార్వాకుడి సంతోషాన్ని మట్టుపెట్టాలని పట్టుదలవచ్చి, ఆయన బాగా ఆలోచించాడు. ఆయకొక విషయం స్ఫురించింది. ఇప్పటివరకూ తనుచార్వాకుణ్ణి ఒంటరిగా వున్నప్పుడు తిడుతున్నాడు. ఎన్ని తిట్టినా ఇతరులకు తెలియదు. నలుగురి ముందూ తిడితే పరమ శాంతమూర్తులుకూడా సహించ లేరు. ఇలా అనుకుని ఒకరోజు సాయంత్రం, ఆయన ఊరి పెద్దల ఎదుట

చార్వాకుణ్ణి నానా మాటలూ అన్నాడు. అయినా,చార్వాకుడు నవ్వుతూనే తన పనులు తాను చేసుకుపోతున్నాడు. దాంతో ప్రారబ్ధుడు రెచ్చిపోయి వాడిని ఇంకా ఇంకా మాట లన్నాడు.

చార్వాకుడైతే ఆమాటలు భరించగలిగాడు కానీ ఊరి పెద్దల్లో సత్యమూర్తి అనే ఒకాయనకు కోపం వచ్చి, "ఒరేయ్, చారా! ఇన్ని మాటలు పడుతూ, ఇంకా ఎందుకు ఇక్కడ పనిచేస్తావు?" అన్నాడు.

"ఊరికే పనిచేస్తున్నానా, డబ్బు పుచ్చుకుం టున్నాను కదా!"అన్నాడు చార్వాకుడు నవ్వుతూ.

"డబ్బుపుచ్చుకుంటే మాత్రం నచ్చనిచోట పనిచేస్తావా?ఆడబ్బు నేనే యిస్తాను.నా ఇంటి కొచ్చి పనిచెయ్యి," అన్నాడు సత్యమూర్తి.

దీనికి చార్వాకుడు ఒక్కక్షణం ఆగి, "ఈ బాబుకు నా పనినచ్చకేం! ఇన్నిసార్లు మాట లైతే అన్నాడు కానీ ఎన్నడూ పనిమానేసి పొమ్మనలేదు. ఆయన పొమ్మనేదాకా ఇంకొ కరింట్లో పనికి ఒప్పుకోవడం ధర్మం కాదు కదా!" అన్నాడు నవ్వుతూ.

"మాటలన్నాడని నువ్వే అన్నావు కదా! మాటలనేచోట పనిచేయడం,నీకు సంతోషంగా వుంటుందా?" అని అడిగాడు సత్యమూర్తి.

"బాబూ! మాటలన్న వాడికి కూడా సేవలు చేయగలిగితే – ఈ ప్రపంచంలో అంతకంటే సంతోషించదగ్గ విషయముంటుందా?" అని జవాబిచ్చాడు చార్వాకుడు.

సత్యమూర్తి ఏదో అనబోతూంటే, ప్రారబ్ధు డాయన్ను ఆపి, "ఆగండి! నాకిప్పుడు వాడి నిత్యసంతోషానికి కారణం తెలిసింది. వాడు ప్రతివిషయంలోనూ మంచిని తీసుకుని, చెడునువిడిచిపెడతాడు. తనేం చేసినా బాధ్య తలు నిర్వహిస్తున్నాననుకుంటాడే తప్ప, పరోపకారంగా భావించడు. తనకు చేతనైనది చేస్తాడు. ఇతరులనుంచి అవసరానికి మించి ప్రతిఫలం ఆశించడు.తనకున్నదానితో తృప్తి చెందుతాడు. లేనిదానిగురించి దిగులు చెందడు. అందుకేవాడు నిత్యసంతోషి! వాడిలా వుండడం అందరికీ సాధ్యం కాకపోవచ్చు. కానీ అలా వుండడానికి ప్రయత్నిస్తే, ఎంతో కొంత దిగులు తప్పక తగ్గుతుంది," అన్నాడు.

ఆ తర్వాత నుంచి ప్రారబ్ధుడు, చార్వాకుడి ముఖంలోని సంతోషం పోగొట్టాలనికాక,తన ముఖంలో దిగులు తొలగించుకునేందుకు ప్రయత్నించి, కొంత ఫలితం సాధించాడు.



చందమామ

# బంగారు గడియలు నెం.7



ఇది బిజాపూర్‌ను పరిపాలించిన ఒక గొప్పవ్యక్తి సమాధి.దీనిని నిర్మించిన వారెవరు?ఈ సమాధి ప్రత్యేకత ఏమిటి?

అస్సాంలోని ఒక చిన్న గ్రామంలో, సెప్టెంబర్-అక్టోబర్ నెలల మధ్య వెన్నెల లేని మంచు రాత్రులలో - కొన్ని పక్షులు కొద్దిగా వెలుతురు కనిపించినా సరే హఠాత్తుగా కిందికి దూసుకు వస్తాయి. ఆ తరవాత కొన్ని రోజుల పాటు పారవశ్యంతో ప్రవర్తిస్తాయి.పక్షుల ఈ విచిత్ర ప్రవర్తనకు ఇంతవరకు ఎవరూ కారణం కనుగొనలేదు. ఈ వింత జరిగే గ్రామం పేరేమిటి?





ఢిల్లీలో పుష్పదళాల ఆకారంలో నిర్మితమైన ఈ భవనం ఒక ప్రార్థనా మందిరం. ఒక పర్షియన్ ప్రవక్తస్థాపించిన అధునాతన మతానికి సంబంధించిన మందిరం ఇది. మరి ఆ మతం పేరేమిటి?

ఇక్కడ. డైనోజార్ శరీరం ఐదు భాగాలుగా ఉన్నది. వీటిని విడివిడిగా కత్తిరించి ఏనుగుబొమ్మ వచ్చేలాగా అమర్చండి.



# టూత్‌బ్రష్‌తో పెయింట్ స్ప్రే చేసుకోండి.

ఒక టూత్‌బ్రష్, కొన్ని రంగులు, కొంచెం ఊహాశక్తి ఉంటే చాలు. మీరొక అందమైన చిత్రాన్ని సృష్టించవచ్చు.



సరళమైన చిన్న డిజైన్లను కత్తిరించి, ఒక డ్రాయింగ్ పేపర్ మీద అందంగా అమర్చుకోండి. నాణాలు, బోల్టులు వంటి బరువైన వస్తువులతో అవి కాగితం మీద బాగా అనుకుని ఉండేలా చేయండి.

ఒక పళ్ళెంలో రంగును నీళ్ళతో కలుపుకోండి. టూత్‌బ్రష్ బ్రిజిల్స్‌ను ఆ రంగులో ముంచెత్తండి. టూత్‌బ్రష్‌ను డ్రాయింగ్ పేపర్ మీద వెల్లకిలా ఉండేలా పట్టుకుని, బొటనవేలితో చిత్రంలో చూపిన విధంగా బ్రిజిల్స్ వెనక్కు లాగి వదలండి. అలా చేయడం వల్ల డ్రాయింగ్ పేపర్ మీద రంగు సన్నటి చుక్కలుగా స్ప్రే అవుతుంది. ఇలా పేపర్ అంతా పూర్తయ్యాక, పేపర్ మీద ఉంచిన డిజైన్స్ తీసేయండి. ఇప్పుడు అందమైన బొమ్మలు కనిపిస్తాయి.



ఇందుకు బట్టల రంగులను, ఫోటోట్రాన్స్‌పరెంట్ ఇంకులను కూడా ఉపయోగించవచ్చు. మొదట ఒక రంగుతో ప్రారంభించి, ఆ తరవాత కావలసినన్ని రంగులు ఉపయోగించవచ్చు. బ్రష్‌ను పేపర్ మీద తీసుకెళ్ళడంద్వారా సన్నటి చుక్కలు పడతాయి. ఒక్కొక్క తెర రంగుల తరవాత డిజైన్లకు మరింత ఆకర్షణ వస్తుంది.





## గ్రీటింగ్ కార్డులో చెట్టును బంధించండి!






1. చతురస్రాకారంలో ఉన్న రంగుకాగితం తీసుకుని చిత్రంలో చూపిన విధంగా గీతల మడత పెట్టండి.

2. కాగితంలో సగం అడుగున నాలుగులో మూడు వంతులు కత్తిరించి పారేయండి. ఆ తరవాత మధ్య మార్గం కత్తిరించండి.

3. తరవాత కాగితాన్ని ఒక చివర కొద్దిగా మడిచి, ఆ మడతను అడ్డుగా ముందుకూ వెనక్కూ మడుస్తూ వెళ్ళండి:



4. ఇప్పుడు మీరు తయారు చేసిన చెట్టు సిద్ధం. దీనిని గ్రీటింగ్ కార్డ్ మధ్యలో అతికించండి.చెట్టు గుబురుగా విస్తరించిఉన్నట్టు కనిపించడానికి పైనున్న గీతలమడతలు కొన్నింటిని అడుగున వచ్చేట్టు అతికించండి.

## కలగాపులగమైన బొమ్మలు

సుప్రసిద్ధమైన సింద్‌బాద్ యాత్ర బొమ్మలకథ ఒకటి ఇక్కడ ఇవ్వబడింది. అయితే, ఆ బొమ్మలు కలగాపులగంగా ఉన్నాయి. వాటిని సరైన క్రమంలో ఇవ్వండి చూద్దాం!





















# మూడు సులభమైన అంచెలలో ఖడ్గమృగం బొమ్మ గీయండి...



## బంగారు గడియలు నెం. 6

## సమాధానాలు



1. కారెల్ కాపెక్. ఆయన తన నాటకం ఆర్.యు.ఆర్‌లో మొట్టమొదట రోబోట్ అనే పదం వాడాడు.

2. మాగ్లేవ్ రైళ్ళకు చక్రాలు లేవు! 'మేగ్నటిక్ లెవియేషన్'కు సంక్షిప్తరూపమే మాగ్లేవ్. ఇవి ప్రత్యేకమైన పట్టాలకు పైన నడిచినప్పటికీ అతి శక్తివంతమైన అయస్కాంత శక్తులచేత పట్టాలకేసి ఆకర్షింపబడుతూ ఉంటాయి.

3. ఎరుపు, ఆకుపచ్చ, నీలం. ఆధారమైన ఈ మూడు రంగుల చుక్కలు, గీతలు కలిసి టీవీ సెట్‌లో రంగు రంగుల చిత్రాలను ఏర్పరుస్తాయి.

> **రోబోట్ లెక్క**
>
> రోజుకు 18 కార్లను తయారుచేసే 9 ఆల్ఫా రోబోట్లు, 27 కార్లను తయారుచేసే 18 బీటా రోబోట్లు, 9 కార్లను తయార్లుచేసే 27 గామా రోబోట్లు.

4. బెంజెమిన్ ఫ్రాంక్లిన్. ఆయన పరిశోధనల ద్వారా కనుగొన్న 'లైట్నింగ్ కండక్టర్' ద్వారా ఎందరి ప్రాణాలనో రక్షించాడు.

5. శతాబ్ద సంవత్సర సిద్ధాంతానికి 2000 వ సంవత్సరం మినహాయింపు. ఎందుకంటే 400తో విభజించబడే సంవత్సరాలు లీప్ సంవత్సరాలు.

6. నౌకను ఎంతవరకు బరువుతో నింపవచ్చో తెలియజేయడానికి నౌక వెలుపల గీయబడే గీత 'ప్లిమ్‌సోల్ లైన్'. ఈ గీతను దాటి నీటిమట్టం ఉండకూడదు.

7. భీకరమానవుడి పేరు ఫ్రాంకెన్‌స్టీన్ అంటే అది తప్పు. ఆ భీకరమానవుణ్ణి సృష్టించిన విజ్ఞానవేత్త ఫ్రాంకెన్‌స్టీన్.




ఇంద్రుడి వద్ద అర్జునుడు ఉండే సమయంలో రోమశుడనే మహర్షి మూడు లోకాలూ తిరుగుతూ స్వర్గానికి వెళ్ళి, ఇంద్రసింహాసనం మీద. ఇంద్రుడితో బాటు కూర్చుని ఉన్న అర్జునుణ్ణి చూసి అంతులేని ఆశ్చర్యంతో, "ఇతను ఎంత తపస్సు చేస్తే ఇంద్రుడి సింహాసనం మీద కూర్చునే అర్హత లభించి ఉండాలి?" అనుకున్నాడు.

ఆయన ఆశ్చర్యాన్ని గమనించి ఇంద్రుడు చిరునవ్వు నవ్వి, "మునీశ్వరా, ఈ అర్జునుడు సాధారణ మానవుడు కాడు; పూర్వ జన్మలో నరుడనే మహర్షి. నారాయణుడనే మహర్షితో కలిసి ఇతను అనేక వేల ఏళ్ళు బదరికావనంలో తపస్సు చేశాడు. నారాయణ ఋషి పూర్వజన్మలో కపిల మహాముని. నరనారాయణులు ఇద్దరూ భూభారం తగ్గించటానికి ఇప్పుడు అర్జునుడుగానూ, కృష్ణుడుగానూ పుట్టి ఉన్నారు. పాతాళంలో ఉన్న నివాతకవచులు దేవతలను చాలా పీడిస్తున్నారు. వారిని ఈ అర్జునుడు నిర్మూలించాలి. అందుకే ఇతన్ని ఇక్కడికి రప్పించాను. నువ్వు భూలోకానికి వెళ్ళి, కామ్యక వనంలో ఉన్న ధర్మరాజుతో, అర్జునుడు స్వర్గంలో నృత్య సంగీతాలు నేర్చుకుంటూ సుఖంగా ఉన్నాడని చెప్పు," అన్నాడు.

రోమశమహాముని ఇంద్రుడు చెప్పిన ప్రకారం భూలోకానికి బయలుదేరాడు.

అర్జునుడు స్వర్గానికి వెళ్ళాడనీ, దివ్యాస్త్రాలు సంపాదించుకున్నాడనీ ధృతరాష్ట్రుడికి వ్యాసుడు తెలిపాడు. వెంటనే ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి పిలిచి, "విన్నావా, సంజయా? అర్జునుడు స్వర్గానికి వెళ్ళి దివ్యాస్త్రాలు సంపాదించాడట! దుర్యోధనుడి దుర్బుద్ధి వల్ల ఎటువంటి ప్రమాదం ఏర్పడిందో చూడు! పాపం, ప్రజలు ఎలాంటి ఆపదలు పొందుతారో! ధర్మరాజూ, అర్జునుడూ కలిసి మూడు లోకాలూ జయించ

30. పాండవుల తీర్థయాత్రలు



గలరు. నా కొడుకులకు చావుమూడింది,'' అని దిగులుపడ్డాడు.

"అందులో అబద్ధం ఏమీలేదు. ద్రౌపదిని సభకు ఈడ్చి తెచ్చి, అన్నివిధాల అవమానిస్తే, మీ కొడుకుల మీద పాండవులకు పగఉండక ఏం చేస్తుంది?'' అన్నాడు సంజయుడు.

అర్జునుడు తిరిగి వచ్చేదాకా తీర్థయాత్రలు చెయ్యమని ధౌమ్యుడు ధర్మరాజుకు చెప్పాడు. ధర్మరాజు తన తమ్ములనూ,ద్రౌపదినీ బ్రాహ్మణ బృందాన్నీ వెంటబెట్టుకుని తిరుగుతూ తీర్థయాత్రలు చేయటానికి పోదామనుకుంటూ ఉండగా వారి వద్దకు రోమశుడు వచ్చి, "ఇంద్రుడి సభ అయిన సుధర్మకు వెళ్ళాను. సింహాసనం మీద మీ అర్జునుడు ఇంద్రుడితోబాటు కూర్చుని ఉన్నాడు. నాకెంతో ఆశ్చర్యం కలిగింది. అర్జునుడు సుఖంగా ఉన్నాడని మీతో ఇంద్రుడు చెప్పమన్నాడు. అందుకే ఇక్కడికి వచ్చాను. అర్జునుడికి ఇంద్రుడు ఎన్నో దివ్యాస్త్రాలు ఇచ్చాడు. ప్రస్తుతం అతను చిత్రసేనుడనే గంధర్వుడి వద్ద నృత్యమూ సంగీతమూ నేర్చుకుంటున్నాడు. ఇంద్రుడు నిన్ను తీర్థయాత్రలు చెయ్యమన్నాడు.నేను ఇది వరకు రెండుసార్లు తీర్థయాత్రలు చేశాను. మళ్ళీ మూడోమారు మీ వెంట వస్తాను,'' అన్నాడు.

ధర్మరాజుకు చాలా ఆనందమయింది. అర్జునుడు వెళ్ళిన పని సానుకూలమయింది. తాను చేయదలచిన తీర్థయాత్రలనే చేయమని ఇంద్రుడు కబురు పంపాడు. ధర్మరాజు తీర్థయాత్రలకు బయలుదేరే ముందు తన వెంటఉన్న బలగంలో కొంతమందిని హస్తినాపురానికీ, మరికొంతమందిని ద్రుపదుడి నగరానికీ పంపి, ఆయుధాలూ కవచాలూ గల ఇంద్రసేనుడు మొదలైన వారిని కొద్దిమందిని మాత్రమే దగ్గిరుంచుకున్నాడు.

పాండవులు తీర్థయాత్రలు చేసుకుంటూ గోమతీతీర్థమూ, కన్యాతీర్థాలూ, గోతీర్థమూ, బాహుదానదీ తీరమూ, త్రివేణీ, గయాక్షేత్రమూ సేవించారు; అగస్త్యుడి ఆశ్రమానికి వెళ్ళి అక్కడ అగస్త్యుడి కథ విన్నారు.

పూర్వం మణిమంతం అనే పట్టణంలో ఇల్వలుడూ, వాతాపీ అని ఇద్దరు అన్నదమ్ములుండేవారు. వాళ్ళు బ్రాహ్మణులకు అతిథ్యం ఇచ్చి చంపేస్తూ ఉండేవాళ్ళు.వాతాపి మేకగా మారేవాడు. ఇల్వలుడు ఆ మేకను వండి బ్రాహ్మణ అతిథికి పెట్టి, "వాతాపీ, రా!'' అని పిలిచేవాడు. వాతాపి ఆ బ్రాహ్మణుడి పొట్టచీల్చుకుని బయటికి వచ్చేవాడు. బ్రాహ్మణ అతిథి చచ్చేవాడు.

ఇలా ఉండగా అగస్త్య మహాముని విదర్భరాజు కూతురైన లోపాముద్రను పెళ్ళాడి, ఆమె కోరగా ధనం తీసుకు రావటానికి బయలుదేరాడు. అగస్త్యుడు ముగ్గురు రాజుల వద్దకు వెళ్ళాడు. కాని ఏ ఒక్కడికీ ఖర్చుకు మించిన ఆదాయం లేదు. కాని, మణిమంతంలో ఉండే వాతాపీ, ఇల్వలుడూ అనే వాళ్ళ వద్ద చాలా ధనం ఉంటుందని విని, అగస్త్యుడు అక్కడికి వెళ్ళాడు.

ఇల్వలుడు తన అలవాటు ప్రకారం వాతాపిని మేకగా మార్చి, వాడి మాంసం అగస్త్యుడికి పెట్టాడు. అగస్త్యుడా మాంసం తిని త్రేన్చాడు. ఇల్వలుడు, "వాతాపీ, రా!" అని పిలిచాడు.

"ఇంకెక్కడి వాతాపి? వాడు అప్పుడే జీర్ణమై పోయాడు," అన్నాడు అగస్త్యుడు. ఇల్వలుడు తెల్లముఖం వేసి, అగస్త్యుడికీ, ఆయన వెంట వచ్చిన ముగ్గురు రాజులకూ అంతులేని ధనం ఇచ్చి పంపేశాడు.

అగస్త్యుణ్ణి గురించి ధర్మరాజు ఇంకా ఎన్నో కథలు విన్నాడు.

ఒకసారి వింధ్యపర్వతం సూర్యుడితో, "నువ్వు మేరువు చుట్టూ ఎందుకు తిరుగుతావు? అంతకన్న గొప్పవాడినైన నాచుట్టూ తిరుగు," అన్నది.

"నేను మేరువు చుట్టూ బుద్ధిపూర్వకంగా తిరగటం లేదు. నాకు విధించబడిన మార్గంలో తిరుగుతున్నాను," అన్నాడు సూర్యుడు.

వింధ్యుడికి కోపం వచ్చి, సూర్యచంద్రుల దారికీ, గ్రహాల దారికీ అడ్డంగా పెరిగాడు. లోకం అంధకారమయమైపోయింది. అప్పుడు దేవతలు అగస్త్యుడి వద్దకు వెళ్ళి, "మునీశ్వరా, నీ శిష్యుడైన వింధ్యుడు లోకాన్ని తారుమారు చేసేశాడు. అతణ్ణి అదుపులో పెట్టు," అని వేడుకున్నారు.





అప్పుడు అగస్త్యుడు లోపాముద్రతో సహా వింధ్యపర్వతం వద్దకు వెళ్ళి, "నాయనా, నేను పని మీద దక్షిణానికి వెళుతున్నాను. దారి ఇయ్యి," అన్నాడు.

వింధ్యుడు అగస్త్యుడికి సాష్టాంగపడి దారి ఇచ్చాడు. "నేను తిరిగి వచ్చేదాకా ఇలాగే ఉండు!" అన్నాడు అగస్త్యుడు. ఆ మహాముని దక్షిణం నుంచి తిరిగి రాలేదు; వింధ్యుడు తిరిగి తల ఎత్తనూ లేదు!

కాలకేయులనే రాక్షసులు సముద్రంలో నివసిస్తూ, రాత్రిపూట భూమి మీదికి వచ్చి బ్రాహ్మణులను క్షోభపెట్టసాగారు. సముద్రం ప్రవేశించి కాలకేయులను చంపటం దేవతలకు సాధ్యంకాక, వాళ్ళు అగస్త్యుడి శరణు జొచ్చారు. అప్పుడా ముని సముద్రజలమంతా ఒక్కగుక్కలో తాగేశాడు.కాలకేయులు బయట పడ్డారు. దేవతలు వారితో యుద్ధం చేసి అనేక మందిని చంపారు. చావగా మిగిలిన కాలకేయులు పాతాళంలోకి పారిపోయారు. అప్పుడు వట్టిపోయిన సముద్రం, భగీరథుడు గంగను భూమికి తెచ్చినప్పుడు తిరిగి జలమయమయింది.

అగస్త్యుడి ఆశ్రమం నుంచి బయలుదేరి పాండవులు అనేక తీర్థాలు సేవించుతూ కౌశికీనదీతీరాన్ని చేరి, అక్కడ ఉన్న విశ్వామిత్రుడి ఆశ్రమమూ, దాని అవతల ఉన్న విభాండకుడి ఆశ్రమమూ చూసి, విభాండకుడి కొడుకైన ఋశ్యశృంగుడి కథ విన్నారు.

అంగదేశాన్ని పాలించే రోమపాదుడు దశరథుడి స్నేహితుడు. ఆయన బ్రాహ్మణులకు ద్రోహం చెయ్యగా బ్రాహ్మణులందరూ ఆ రాజ్యాన్ని వదిలిపోయారు. తరవాత అక్కడ వానలు కురవక క్షామం ఏర్పడింది. అప్పుడు రోమపాదుడు తన మంత్రుల సలహాపై అందగత్తెలను పంపి, ఋశ్యశృంగుణ్ణి ఆకర్షించి తన దేశానికి తెచ్చుకుని, తన కుమార్తె అయిన శాంతను అతనికిచ్చి పెళ్ళి చేశాడు. ఋశ్యశృంగుడు అడుగు పెట్టగానే అంగదేశంలో ఎప్పటిలాగా వానలు కురిశాయి.

పాండవులు ఇలా అనేక తీర్థాలు సేవిస్తూ మహేంద్ర పర్వతం వద్దకు వెళ్ళారు. అక్కడ అకృతవర్ణుడనేవాడు ధర్మరాజుకు పరశురాముడి కథ చెప్పాడు. హైహయవంశాన పుట్టిన కార్తవీర్యుడు దత్తాత్రేయుడివరం చేత వెయ్యిచేతులు సంపాదించి, బలమదాంధుడై అనేక ఉపద్రవాలు చేశాడు. ఒకనాడు ఆ కార్తవీర్యుడు పరశురాముడి తండ్రి



అయిన జమదగ్ని ఆశ్రమానికి వచ్చి, ఆశ్రమాన్ని ధ్వంసం చేసి, హోమధేనువును పట్టుకు పోయాడు. పరశురాముడు ఆశ్రమానికి తిరిగివస్తూనే ఈ సంగతి విని, కార్తవీర్యుడితో యుద్ధంచేసి చంపేశాడు. తరవాత కార్తవీర్యుడి కొడుకులు వచ్చి, ఒంటరిగా ఆశ్రమంలో ఉన్న జమదగ్ని గొంతు కోసి వెళ్ళిపోయారు. అప్పుడు పరశురాముడు పగబట్టి ఇరవై ఒక్క మార్లు ప్రపంచమంతా తిరిగి, కనిపించిన ప్రతి క్షత్రియుణ్ణీ చంపాడు.

పాండవులు ప్రభాస తీర్థాన్ని చేరుకున్నప్పుడు, ఆ వార్త తెలిసి బలరాముడూ, కృష్ణుడూ మొదలైన యాదవులు వారిని చూడవచ్చారు. ధర్మరాజు యుద్ధంలో కౌరవులనందరినీ చంపి రాజ్యం పొందుతాడని యాదవులు పాండవులకు ధైర్యం చెప్పారు.

యాదవులు ద్వారకకు తిరిగి వెళ్ళినాక పాండవులు తీర్థయాత్రలు కొనసాగించారు. వారు చివరకు గంధమాదనపర్వతం చేరి, అక్కడ అర్జునుడి రాకకోసం ఎదురు చూడ నిర్ణయించుకున్నారు. అది మహాపవిత్రమైన ప్రదేశం; అన్ని పుణ్యస్థలాలలోకీ గొప్పది. అక్కడ పాండవులు నరకాసురుడి అస్థికల గుట్టచూశారు.

వాళ్ళు గంధమాదన పర్వతాన్ని చేరబోతూ ఉండగా భయంకరమైన గాలి బయలు దేరింది. దానితో దుమ్ము లేచి అంతటా అంధకారమయి పోయింది. తరవాత ఆర్భాటంగా మెరుపులతో, ఉరుములతో కుండపోతగా వర్షం కురిసింది. తమ్ము తాము రక్షించుకోవటానికి తలా ఒకదారీ అయిపోయారు. తిరిగి తెల్లవారేసరికి తెరిపి ఇచ్చింది. కాని ద్రౌపది నడకప్రయాస వల్లా, వానదెబ్బకూ, చలికీ గడగడవణుకుతూ మూర్ఛపోయింది. ఆమె రాళ్ళమీద పడి పోకుండా నకులుడు పట్టుకుని, ధర్మరాజును కేకపెట్టాడు. ధర్మరాజూ, భీముడూ, సహదేవుడూ ద్రౌపదిని ఆ స్థితిలో చూసి కొంతసేపు దిగ్భ్రమచెందారు.

ధర్మరాజు ద్రౌపది తలను తన తొడమీద పెట్టుకుని చాలాసేపు దుఃఖించాడు. మిగిలిన వాళ్ళు ఆమెకు ఉపచారాలు చేశారు. దారి చాలా కంటకంగా ఉన్నది. ముందుకు సాగేమార్గం కనిపించలేదు. అప్పుడు భీముడు తలచుకునేసరికి, ఘటోత్కచుడు తన రాక్షస బలగంతో వచ్చాడు. ఘటోత్కచుడు పాండవులనూ, ద్రౌపదినీ ఎత్తుకున్నాడు. మిగిలిన వాళ్ళను రాక్షసులు ఎత్తుకున్నారు. ప్రయాణం అతివేగంగా సాగింది. వాళ్ళు కాలక్రమాన

కైలాసం సమీపంలో ఉన్న బదరికాశ్రమం దగ్గిర గంగాప్రవాహం ఉన్నచోట రాక్షసుల భుజాలమీద నుంచి దిగి, గంగలో స్నానాలు చేశారు. అక్కడే వారు నివాసాలు ఏర్పరుచుకున్నారు. అక్కడ ఉండే మునులు పాండవులకు కందమూలాలతో అతిథిసత్కారం చేశారు.

వాళ్ళు అక్కడ ఆరురోజులున్న తరవాత వారికి గాలివెంట ఒక దివ్యమైన సువాసన తెలియ వచ్చింది. అంతలోనే పాండవుల మధ్య ఒక అపూర్వమైన పుష్పం పడింది. అది వెయ్యిరేకులు గల ఎర్రకలువపువ్వు. చూడటానికి ఎంతో అందంగా ఉండి, అద్భుతమైన సువాసనలు వెదజల్లుతున్నది.

ద్రౌపది ఆ పుష్పాన్ని తీసుకుని భీముడితో, "దీన్ని ధర్మరాజుకు ఇస్తాను. ఇలాటి పుష్పాలను మనం తీసుకుపోయి కామ్యకవనంలో ఉంచుకుందాం. నాకోసం ఈ పూలను వెతికి తీసుకురాగలవా?" అన్నది.

భీముడు ఆమె కోరిక తీర్చే ఉద్దేశంతో విల్లూ, అంబులపొదీ తీసుకుని, ఏ గాలికి సౌగంధికపుష్పం వచ్చిపడిందో ఆ గాలి వచ్చిన దిక్కుగా బయలుదేరాడు. కోకిలల పాటలూ, తుమ్మెదల ఝుంకారాలూ, సెలయేళ్ళ గలగలలూ వింటూ, ద్రౌపదిని తలుచుకుంటూ, దారికి అడ్డం వచ్చిన చెట్లను విరుస్తూ, లతలను తెంపేస్తూ, మధ్యమధ్య అరణ్యం దద్దరిల్లేటట్టు సింహనాదాలు చేస్తూ, చాలా దూరం వెళ్ళాడు. ఒకచోట అంతులేని అరటితోట వచ్చింది. ఆ అరటి చెట్లను తోసుకుని పోతూ భీముడు మళ్ళీ సింహనాదం చేశాడు. దానికి భయపడి నీటి పక్షుల గుంపు ఆకాశంలోకి ఎగిరింది. ఆ పక్షులను చూసి, అటుగా నీరున్నదని గ్రహించి భీముడు ఆ దిక్కుగా వెళ్ళి ఒక సరస్సును చేరుకున్నాడు.

భీముడు ఆ సరస్సులో చల్లగా స్నానం చేసి, మళ్ళీ అరటితోట వెంబడి బయలుదేరి, కొంతదూరం వెళ్ళి, భుజాలు చరచుకుని, మరొకసారి సింహనాదం చేశాడు. ఆ అరటితోటలోనే ఉన్న హనుమంతుడు, ఆ సింహనాదం చేసినది భీముడని గ్రహించి, భీముణ్ణి చూడబోతున్నందుకు సంతోషించి, భీముడు వచ్చేదారికి అడ్డంగా పడుకుని, తన తోకను టెక్కెంలాగా పైకి ఎత్తి, దిక్కులు అదిరేలాగా ఒక్క చరుపు చరిచాడు.

ఆ చప్పుడు విని భీముడు హనుమంతుడు ఉన్న చోటికి వచ్చాడు.



# చందమామ కబుర్లు

## ఏనుగుకు 'రేడియో కాలర్'

అడవులలో తిరిగే ఏనుగులను కనిపెట్టి ఉండడం ఎలా? సర్వవేళలా వాటిని వెంబడించి వెళ్ళడం సాధ్యమయ్యే పని కాదు. అందువల్ల చిన్న రేడియో పరికరం అమర్చిన ఒక కాలర్‌ను ఏనుగు మెడకు కడుతున్నారు. రేడియోకు రిమోట్ కంట్రోల్ ఉంటుంది. దీని ద్వారా ఏనుగులను పర్యవేక్షించడం సులభమవుతుంది. పశ్చిమబెంగాల్‌లోని జల్దపారా జంతుశరణాలయంలో ఇటీవల ఒక ఆడఏనుగు, ఏనుగుల గుంపును నడిపించుకుని వెళ్ళడం కనిపించింది. మగ ఏనుగుకు మత్తుమందు ఇచ్చి, రేడియో కాలర్‌ను కట్టారు. ఇప్పుడు మగ ఏనుగును అనుసరించి, ఇతర ఏనుగుల గుంపు తిరుగుతున్నది. అందువల్ల ఆ ఏనుగుల గుంపును పర్యవేక్షించడం 'వన్యమృగశాఖ'కు కష్టంకాదు. ఏనుగుకు కాలర్ అమర్చడం ఇది ఐదవసారి. అయితే, ఇంతకు పూర్వం విడిగా తిరిగే మగ ఏనుగులకే ఇటువంటి కాలర్ అమర్చారు.

## అందాల 'ఒంటె'!

'బింటి హెూమ్‌లోల్' అనే ఒంటె 3,90,000 అమెరికా డాలర్లకు (దాదాపు 1.37 కోట్ల రూపాయలు) అమ్ముడుపోయింది. పలు గల్ఫ్ దేశాలలో ఒంటె పందాలు చాలా ప్రసిద్ధమైన క్రీడ. ఓమన్‌లోనే అతి వేగంగా పరిగెత్తే ఒంటెలున్నాయి. ఇక్కడి ఒంటెలు మామూలుగా800 డాలర్లు పలుకుతాయి. ఇంతవరకు అత్యధిక ధర 2,60,000 డాలర్లే. అయితే 'బింటి'ని 3,90,000 డాలర్లు పెట్టి యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌కు చెందిన ఒక అజ్ఞాత వర్తకుడు కొన్నాడు. ఇది అత్యంత వేగంగా పరిగెత్తే ఒంటె అని అతడు భావిస్తున్నాడు. అందుకే దీనిని 'అందాల ఒంటె' అని చెప్పుకుంటూ మురిసిపోతున్నాడు!

## భారతీయ చిత్రాలకు రికార్డు ధర!

లండన్‌లోని సుప్రసిద్ధమైన సౌథ్‌బీస్ ఆక్షన్ కంపెనీ అక్టోబర్ 8వ తేదీ భారతీయ చిత్రకారులు చిత్రించిన 150 చిత్రాలను వేలానికి ఏర్పాటు చేసింది. సుప్రసిద్ధ కేరళ చిత్రకారుడు రాజా రవివర్మ (1848-1906) నుంచి, ఈ నాటి సుప్రసిద్ధ భారతీయ చిత్రకారుడు ఎమ్.ఎఫ్. హుస్సేన్ వరకు గల పలువురి చిత్రాలను ప్రదర్శనకు ఉంచారు. ఆ రోజు వేలానికి వదిలిన 10 చిత్రాలలో 8 రవివర్మవే. ఒక చిత్రం ధర 2,80,000 రూపాయలు చెబితే వేలంపాట 14,16,800 రూపాయల వరకు వెళ్ళింది. అదే ఆ రోజు ఎక్కువ ధర పలికిన చిత్రం. మిగిలిన ఆయన 7 చిత్రాలూ 11,20,200 రూపాయలకు పైనే పలికాయి. రవీంద్రనాథ్ టాగూర్ చిత్రం ఒకదాన్ని 9,13,040 రూపాయలకు కొన్నారు. హుస్సేన్ చిత్రాలు ఈ ధరల దరిదాపులకు రాలేకపోయాయి. ఈ చిత్రాలు కొన్నవారిలో ఎక్కువ మంది అక్కడ స్థిరపడిన భారతీయులు కావడం విశేషం!

## 'మ్యాక్' పోలీస్‌మేన్!

కాలిఫోర్నియా శాన్ జోస్ పోలీసు విభాగానికి రోబోట్ పోలీస్‌మేన్ - 'ఆఫీసర్‌మ్యాక్' ఉన్నాడు. మిగతా పోలీసు వాళ్ళలాగే అతడూ అక్టోబర్ నెలారంభంలో పదవీస్వీకారం చేశాడు. 'మ్యాక్' వీధులలో తిరుగుతూ నేరాలు అరికట్టడం ఎలాగో ప్రజలకు నేర్పుతాడు!



చందమామ
అనుబంధం – 97

# మనదేశపు చెట్లు

## బిల్వవృక్షం

మనదేశంలో పవిత్రంగా భావించబడే వృక్షాలలో బిల్వవృక్షం చాలా ముఖ్యమైనది. శివార్చనకు బిల్వ పత్రాలను ఉపయోగిస్తారు. బిల్వ ఆకులు మృదువుగానూ, మందంగానూ ఉంటాయి. శివాలయ ప్రాంగణాలలోనూ, పెద్ద పెద్ద ఉద్యానవనాలలోనూ ఈ చెట్లను పెంచుతారు. ఇవి వాటంతట అవి పెరిగే స్వభావం కలవి. బిల్వఫలం కూడా పవిత్రమైనదిగా చెబుతారు. సంపదకూ, సమృద్ధికీ దీనిని చిహ్నంగా చెప్పుకుంటారు. అందుకే దీనిని శ్రీఫలం అని కూడా అంటారు. బిల్వను హిందీ, బెంగాలీ, మరాఠీ భాషలలో బేల్ అనీ; గుజరాతీలో బిలీ అనీ; తమిళం, మలయాళ భాషలలో విల్వం అనీ; తెలుగులో మారేడు అనీ అంటారు.

ఎప్పుడూ పచ్చగా కనిపించే బిల్వచెట్లు 10 మీటర్ల ఎత్తు వరకు పెరుగుతాయి. చెట్టు బెరడు మందంగానూ, ముళ్ళతోనూ ఉంటుంది. కొమ్మలపై ముడులుంటాయి; కొమ్మలు వంకరటింకరగా ఉంటాయి. శీతాకాలంలో ఆకులు రాలుతాయి. వసంతకాలం రాగానే మరింత గుబురుగా చిగురిస్తాయి. లేత పచ్చ– తెలుపు రంగు పూలు మంచి వాసన కలిగి ఉంటాయి. పైన గట్టి పెంకు ఉంటుంది. లోపలి గుజ్జును తినవచ్చు. ఎండిన గుజ్జుతో చక్కెర, మజ్జిగ కలిపి వేసవిలో రుచికరమైన చల్లటి పానీయం తయారు చేస్తారు. బిల్వ ఫలాలు, పత్రాలు, బెరడు, వేళ్ళు అన్నీ ఔషధగుణాలు కలిగి ఉన్నాయి. ఈ చెట్లు భారత దేశమంతటా వ్యాపించి ఉన్నాయి.

నారింజ, నిమ్మలాగా బిల్వవృక్షం 'రుటాసీ' వృక్ష జాతికి సంబంధించినది.



మనదేశపు ఋషులు:

# ఆస్తీకుడు

మానసాదేవి - జరత్కార మునుల కుమారు డైన ఆస్తీకుడు చ్యవనుడి వద్ద విద్య నభ్యసిం చాడు. మానసాదేవి కశ్యపముని పుత్రిక. ఆమెకు సర్పాల మీద అధికారం ఉండేది. ఒకప్పుడు సర్పాలకు ఘోరమైన ఆపద వచ్చింది:

అర్జునుడి మనమడైన పరీక్షిత్తు అడవికి వేటకు వెళ్ళాడు. అడవిలో ఆయన తరుము కుంటూ వెళ్ళిన మృగం ఒకటి శమీకముని ఆశ్రమంకేసి వెళ్ళింది. రాజు అక్కడికి వెళ్ళి, మునిని దానిని గురించి అడిగాడు. ముని ధ్యాన నిమగ్నుడై ఉండడం వల్ల రాజుకు సమాధానం ఇవ్వలేదు. ఆగ్రహంతో నిదానం కోల్పోయిన రాజు, పక్కన పడి ఉన్న చచ్చిన పామును తీసి ముని మెడ మీదికి విసిరాడు. ఆ దృశ్యాన్ని చూసిన శమీకముని కుమారుడు శృంగి, "దురహంకారి అయిన ఈ రాజు,ఏడు రోజులలో పాముకాటుతో మరణించు గాక!" అని శపించాడు!

పరీక్షిత్తు విషయం తెలిసి, తన చర్యకు పశ్చాత్తాపం చెందాడు. పాముకాటు నుంచి తనను కాపాడుకోవడానికి పాములకు దుర్గ మమైన ప్రదేశంలో ఒక భవనం నిర్మించుకుని, అందులోకి వెళ్ళాడు. భవనం చుట్టూ కాపలా ఉంచాడు. అయినా, తక్షకుడనే సర్పరాజు, చిన్న పురుగుగామారి, ఒక పండులో ప్రవేశించి రాజు వద్దకు చేరాడు. ఏడవరోజు, రాజు ఆ పండునుతినడానికి వలిచినప్పుడు, ఆ పండు నుంచి వెలువడిన తక్షకుడు రాజును కాటు వేసి చంపాడు!

తక్షకుడి చర్యకు ఆగ్రహం చెందిన పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు సర్పవంశాన్నే నిర్మూలించాలన్న పట్టుదలతో సర్పయాగం తలపెట్టాడు. మునుల మంత్రాలకు ఎక్కడెక్కడి నుంచో పాములు వచ్చి హోమ కుండంలో పడి ప్రాణాలు వదలసాగాయి. తక్షకుడు హడలి పోయాడు. వెళ్ళి ఇంద్ర సింహాసనాన్ని చుట్టుకున్నాడు. అయినా సర్ప యాగ ప్రభావంతో, సింహాసనం మీది ఇంద్రుడితో సహా, తక్షకుడు హోమకుండం కేసి రాసాగాడు!

ఆ దృశ్యాన్ని చూసి భయభ్రాంతులైన దేవతలు, మానసాదేవి దగ్గరికి వెళ్ళి ఆపద నుంచి రక్షించమని ప్రార్థించారు. మానసాదేవి, కుమారుడైన ఆస్తీకుణ్ణి, సర్పయాగాన్ని ఆపించమని కోరింది.

ఆస్తీకుడు జనమేజయుడి దగ్గరికి వెళ్ళాడు. మునికుమారుడు తన విద్యాబుద్ధులతో ఆయనను మెప్పించాడు. ముని కుమారుడి మంచి మాటలకు ముగ్ధుడైన రాజు ఏం వరంకావాలో కొరుకోమన్నాడు. ఆస్తీకుడు సర్పయాగం ఆపమన్నాడు.జనమేజయుడుసర్పయాగాన్నిఆపాడు. తక్షకుడితో సహా మిగిలిన పాములు రక్షింపబడ్డాయి. ఆస్తీకుణ్ణి భక్తితో తలుచుకుంటే సర్పభయంఉండదని కొందరివి శ్వాసం!



# మీకు తెలుసా?

1. 'వందేమాతరం' గీత రచయిత ఎవరు?
2. ప్రపంచంలో కెల్లా అతి చిన్న స్వతంత్ర దేశం ఏది?
3. సూర్యుడి చుట్టూ ఎన్ని గ్రహాలు తిరుగుతున్నాయి?
4. ఇంగ్లాండును యూరపు నుంచి వేరు చేసే కాలువ ఏది?
5. భారత జాతీయ పుష్పం ఏది?
6. 'మికీమౌస్', 'డొనాల్డ్ డక్' సృష్టికర్త ఎవరు?
7. విదేశ వస్తువుల మీద వేసే సుంకం పేరేమిటి?
8. అమెరికా కరెన్సీ పేరేమిటి?
9. నర్సు వృత్తి స్థాపకులుగా ఎవరిని చెబుతారు?
10. భారత పార్లమెంటులోని రెండు సభల పేర్లేమిటి?
11. చదరంగపు పలకలో ఉన్న గళ్ళు ఎన్ని?
12. సూర్యరశ్మిలో లభించే విటమిను ఏది?
13. బంగారు ఎక్కువగా లభించే దేశం ఏది?
14. తెల్ల జెండాను ఏ పరిస్థితిలో ఉపయోగిస్తారు?
15. మన సౌరమండలంలోని అతిపెద్ద గ్రహం ఏది?
16. 'నైటింగేల్ ఆఫ్ ఇండియా' అని ఎవరిని చెబుతారు?
17. జంతువులలో కెల్లా చాలా ఎత్తయినది ఏది?
18. ఒలింపిక్ క్రీడలు ఎన్నేళ్ళకొకసారి జరుగుతాయి?

## సమాధానాలు

1. బంకించంద్ర ఛటర్జీ.
2. రోములోని వాటికన్ సిటీ.
3. భూమితో సహా తొమ్మిది.
4. ఇంగ్లీష్ ఛానెల్.
5. తామర.
6. వాల్ట్ డిస్నీ.
7. కస్టమ్స్ డ్యూటీ.
8. డాలర్.
9. ఫ్లారెన్స్ నైటింగేల్.
10. లోక్‌సభ, రాజ్యసభ.
11. 64; నల్లవి 32, తెల్లవి 32.
12. డి విటమిను.
13. దక్షిణ ఆఫ్రికా.
14. సంధి చేసుకోవాలనుకున్నప్పుడు.
15. గురుగ్రహం.
16. సరోజినీ నాయుడు.
17. జిరాఫీ.
18. నాలుగేళ్ళకు.

# చెప్పులజత పావలా

హేలాపుర నివాసి చంద్రయ్య, పాత్రసామానులు కొనేందుకు సంతకు బయలుదేరాడు. పాత చెప్పులు కావడంతో, దారిలో ఒక కాలిచెప్పు ఉంగటం తెగిపోయింది. పనిలో పనిగా చెప్పులు కూడా కొందామను కుంటూ ముందుకు సాగాడు.

చంద్రయ్య వెళ్ళే దారి పక్కన పాతకాలపు దేవాలయం ఒకటున్నది. దానికి అల్లంత దూరంలో ఒక దుకాణం ముందు చెప్పుల జతలు వరసగా పేర్చబడివున్నవి. వాటిని చూసిన చంద్రయ్య, సంతకు చేరకముందే చెప్పులు కొనుక్కుందామనుకుంటూ దుకాణం ముందుకు వెళ్ళాడు. అక్కడ ఒక చెక్కబల్ల మీద, 'చెప్పులజత పావలా' అని రాసి వున్నది. కనీసం పదిరూపాయల ఖరీదు చేసే చెప్పులు ఎంత చవకయిపోయాయి– అని సంబరపడుతూ చంద్రయ్య తనకు నచ్చిన చెప్పుల జత ఎంచుకుని, వాటిలో పాదాలుంచి చూశాడు. అవి చక్కగా అతికినట్టు సరిపోయాయి.

అప్పుడు చంద్రయ్య దుస్తుల్లోంచి ఒక పావలా తీసి దుకాణం వాడికివ్వబోయాడు. వాడు చంద్రయ్య కేసి అనుమానంగా చూస్తూ, "ఈ జత మీది కాదు, బట్టల దుకాణం పాపయ్యగారిది. అయినా మీరిక్కడ చెప్పుల జత విడవలేదే!" అన్నాడు. అంతలో పాపయ్య అక్కడికి వచ్చి, చంద్రయ్యకేసి కళ్ళురుముతూ చూసి, "పట్టపగలే దొంగతనమా! అదీ దేవాలయం ముందు!" అన్నాడు.

చంద్రయ్య చప్పున చెప్పులు వదిలి, "అయ్యా, నేను దొంగను కాదు. ఆ చెక్కబల్ల కేసి చూడండి! 'చెప్పుల జత పావలా' అని రాసి వున్నది. 'చెప్పులజతకు పావలా' అని వుంటే, ఈ పొరపాటు జరిగేదే కాదు. బాగా చదువుకోని వాళ్ళతో పెద్ద చిక్కు!" అన్నాడు. పాపయ్య ఆదరాబాదరాగా చెప్పులు తొడుక్కుని, "అవును, బాగా చదువుకోని వాళ్ళతో పెద్ద చిక్కే, కాని, బాగా చదువుకునీ చెప్పులజత పావలాకు కొనుక్కోవచ్చుననుకునే వాళ్ళతో మరింత పెద్ద చిక్కు!" అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. – కోనే నాగవెంకట ఆంజనేయులు





# అమావాస్యదయ్యాలు

కొండాపురం కొండయ్యకూ, కోనాపురం కోమలికీ కొత్తగా పెళ్ళయింది. కొండయ్య తల్లిదండ్రులు అతడి చిన్నతనంలోనే పోయారు. పెంచి పెద్ద చేసిన అవ్వ కూడా, అతడి పెళ్ళికళ్ళ చూడకుండానే కన్ను మూసింది. అవ్వ నుంచి తనకు సంక్రమించిన పదెకరాల పొలం కౌలు కిచ్చి, దాని మీద వచ్చే ఆదాయంతో సుఖంగా బతుకుతున్నాడు కొండయ్య.

కోమలికి కొత్తకాపురం ఎంతో ఆనందంగా వుంది.ఏ బాదరబందీ లేదు. ఇద్దరూ అన్యోన్యంగా వుంటున్నారు. ఇలావుండగా -వాళ్ళ పక్కింట్లోకి కొత్తగా అద్దెకు దిగిన అలివేలు, పచ్చగా వున్న కోమలికాపురాన్ని చూడలేక పోయింది. ఆమె పనిగట్టుకుని మొగుడూ, పెళ్ళాల మధ్య తంపులుపెట్టడం ఆరంభించింది.

"ఉద్యోగం సద్యోగం ఏమీ లేని నీ మొగుడు, నీకు వంటపనిలో సాయపడవచ్చు గదా!"అనేది, కట్టెలు మండక పొయ్యి రాజేయడానికి అవస్థ పడుతున్న కోమలితో.

"తెలియకడుగుతానూ - పెళ్ళయి ఏడాదయినా,ఇంకా ఒకకాసు బంగారమైనా కొనలేదా, నీ మొగుడు! అసలు పెళ్ళాం మీద ప్రేమవుంటే గదా!" అనేది, ప్రతి పేరంటానికీ ముత్యాలగొలుసు మాత్రం వేసుకువచ్చే కోమలితో.

"మీ నాన్న కట్నం ఇచ్చుకోలేకగానీ, నీ చక్కదనానికి ఏ పెద్దజమీందారు సంబంధమో కాకపోయినా, ఏ పిల్లజమీందారు సంబంధమో వచ్చి వుండేది!" అనేది, బట్టలుతికి పిండుకుంటున్న కోమలి దగ్గరకు పని గట్టుకువచ్చి.

అలివేలు మాటలు వినగా వినగా తల కెక్కడంతో కోమలి, చీటికీమాటికీ కొండయ్యతో తగవుపెట్టుకుని, అతణ్ణి చులకన చేస్తూ మాట్లాడేది.

మాచిరాజు కామేశ్వరరావు



ఒకనాటి రాత్రి అలివేలు మాటలు గుర్తుకు వచ్చి, కోమలికి చాలాసేపటివరకూ నిద్ర పట్టలేదు. కొండయ్య గట్టిగా గురక పెడుతూ నిద్రపోతున్నాడు.

ఒళ్ళు మండిపోయిన కోమలి, కొండయ్యను తట్టిలేపి, "నువ్వు గురకమానతావా? నన్ను ఎక్కడికైనా పొమ్మంటావా?" అన్నది కోపంగా.

నడిరాత్రి నిద్రలేపి, భార్య తగవులాడుతున్నందుకు కొండయ్య చిరాకుపడి, "ఆడదానివి, చీకట్లో ఎక్కడికి వెళతావు? నేనే వెళతానులే!" అంటూ ఆవేశంగా ఇంట్లోంచి బయటకు వచ్చేశాడు.

కొండయ్య, భార్య గయ్యాళితనానికి చింతపడుతూ ఊరుదాటి, పొలిమేరదాటి, దాపులనున్న అడవిలో చాలా దూరం నడిచాడు. అమావాస్య కావడంతో అడవి అంతా చిమ్మచీకటిగా వుంది. కొండయ్య తిరిగి ఊరిదారిపడదాం అనుకుంటుండగా, ఒక మర్రిచెట్టుకింద దీపాలకాంతి కనిపించింది. అతడు అటుకేసి నడిచాడు.

మర్రిచెట్టు కింద కాగడాల వెలుగులో నాలుగు దయ్యాలు, ఏదో వినోద కార్యక్రమంలో మునిగివున్నాయి. గయ్యాళి భార్య భయం ముందు, దయ్యాల భయం దిగదుడుపు! అన్న అవ్వ చెప్పిన సామెత గుర్తు రాగా, కొండయ్య ధైర్యంగా మరికొంత ముందుకు నడిచాడు.

అక్కడ దయ్యాల నాయకుడు కీచు గొంతుతో, "అందరూ అతి జాగ్రత్తగా వినండి! నలుగురిలో ఎదుటివారిని ఎవరు ఎక్కువగా నవ్విస్తారో, వాళ్ళకు ఒక అద్భుతవస్తువు బహుమతి!" అంటున్నాడు.

కొద్దిక్షణాలు గడిచేంతలో ఒక దయ్యం కీచుగొంతుతో ఏదో పాట పాడింది. మరొక దయ్యం పొడవాటి కాళ్ళను ఎగరవేస్తూ ఆడింది. ఇంకొకటి హాస్యకథ అంటూ ఏదో చెప్పడం ప్రారంభించింది.

కొండయ్యకు, దయ్యాల వినోదకార్యక్రమంలో వినోదించడానికి ఏమీ కనిపించలేదు. అతడు నిద్ర ముంచుకు వస్తుండగా ఆవలిస్తూపోయి, దాపులనున్న మరొక మర్రిచెట్టు నానుకుని కూర్చుని నిద్రలోకి జారుకున్నాడు. ఆ వెంటనే గురక ఆరంభమైంది.

ఆ ధ్వనికి దయ్యాలు, ఒక తృటికాలం నివ్వెరపోయి, చుట్టూ కలయచూడగా గురక పెడుతున్న కొండయ్య కనిపించాడు. అవి నాలుగూ అడుగులో అడుగు వేసుకుంటూ

అతణ్ణి సమీపించాయి. గురక పెట్టేప్పుడు పైకీకిందికీ కదిలేకొండయ్య బుర్రమీసాలూ, బానకడుపూ,చివరగా వచ్చే ఈల లాంటి ధ్వనీ వాటిని పొట్టచెక్కలయ్యేలా నవ్వించాయి.

దయ్యాల నవ్వులకు కొండయ్య కళ్ళు తెరిచాడు. దయ్యాల నాయకుడు అతడితో, "మేం ప్రతి అమావాస్యకు ఇక్కడ వినోద కార్యక్రమం ఏర్పాటు చేసుకుంటాం. ఈ రోజు కార్యక్రమంలో గెలుపు నీదే! మమ్మల్నందర్నీ వినోదపరిచావు!" అంటూ, ఒక నల్లటోపీని కొండయ్య తలమీదపెట్టి మిగిలిన దయ్యాలతో మాయమయ్యాడు.

ఆ సరికి కొండయ్యకు భార్య మీద కోపం తగ్గడంతో, అక్కడినుంచి బయలుదేరాడు. అతడు ఇల్లు చేరేసరికి తెల్లవారవస్తున్నది. ఆ సమయంలో కోమలి ఇంటి ముందు ముగ్గుపెడుతున్నది. ఆమె కొండయ్యను చూసీచూడనట్టు ఊరుకున్నది.కాని, రాత్రి తన మూర్ఖపు ప్రవర్తనకు మొగుడికి ఎలాక్షమాపణచెప్పాలా అని ఆలోచిస్తున్నది.

"శత్రువుల మధ్య, స్నేహితుల మధ్యక్షమాపణలు చెల్లుతాయి గాని, మొగుడూ పెళ్ళాల మధ్య క్షమాపణలేమిటి? ఛీ, ఛీ, వెర్రిదానా!" అన్నాడు కొండయ్య.

"నామనసులోని ఆలోచన, ఈయనకెలా తెలిసిందబ్బా!"అనుకుంటూ ఆశ్చర్యపోయింది కోమలి.

"నీ మనసులోని ఆలోచన తెలిసిపోవడం నాకూ ఆశ్చర్యంగానే వున్నది!" అన్నాడు కొండయ్య.

"తలమీద ఆ నల్లటోపీ ఏమిటి? అసహ్యంగా!"అని కోమలి అనుకూండడం తెలిసి,



కొండయ్య టోపీలాగి చేత్తో పట్టుకున్నాడు. ఇప్పుడు టోపీ తలమీదినుంచి తీశాక,కొండయ్యకు పెళ్ళాం మనసులోని ఆలోచన తెలియడం లేదు.అతడు దయ్యాలు తనకుఅద్భుతమైన టోపీని ఇచ్చాయని గ్రహించి ఆనంద పడిపోతూ, పెళ్ళానికి అడవిలో జరిగిందంతా చెప్పాడు.

కోమలి కొంచెంసేపు ఆలోచించి కొండయ్యతో, "చూడూ! ఇటువంటి అద్భుతమైన టోపీ మనకెందుకు? రాజుగారికి కానుకగా ఇచ్చిరా. ఆయన మిత్రులెవరో, శత్రువులెవరో తెలుసుకోలేని మందమతి అని చెబుతారు. ఈ టోపీ ఆయనకు ఉపయోగిస్తుంది," అన్నది.

"ఆహాఁ కోమలీ! నీకున్న రాజభక్తిలో ఒక్కపాలు రాజ్యంలో వున్న వాళ్ళందరికీ



కుందాం?" అని అడిగాడు. దానికి కోమలి చిన్నగానవ్వి, "అప్పట్లో చెడనుకున్న నీ గురక మనకు మేలేచేసింది. ఇక దాని అవసరం లేదు. వ్యాపార మర్మాలెరిగిన స్నేహితులను సంప్రతించి, ఏదైనా వ్యాపారం మొదలుపెట్టు. అలా ఏదో ఒక పనిలోపడితే బానపొట్టా, గురకా – రెండూ మటుమాయం కాగలవు," అన్నది.

కొండయ్యకు, భార్య సలహా బాగా నచ్చింది.

ఈలోపల – నెల క్రితం చెల్లెలి పెళ్ళికని తమ ఊరు వెళ్ళిన అలివేలు తిరిగివచ్చి, కోమలివాళ్ళ దశతిరిగిపోవడం చూసి నిర్ఘాంత పోయింది. ఆమె కోమలిని మాటల్లో దింపి, అమావాస్యదయ్యాల రహస్యం రాబట్టింది.

ఆ రాత్రే ఆమె, భర్త అవతారానికి కొండయ్యకు పట్టిన అదృష్టం గురించి చెప్పి, "ఈ రోజు అమావాస్య. నువ్వు అడవికి పోయి కొండయ్యలా గురకపెట్టి దయ్యాలను మెప్పించు. తర్వాత వాటిని, ఎదుటి వారి మనసులో ఏమున్నదీ తెలుసుకునే టోపీకాక, తలమీద పెట్టుకుంటే ఎవరికీ కనబడకుండా వుండే టోపీ అడుగు. అది తీసుకుని అటునుంచి అటు రాజధానికి పోయి, అదృశ్యరూపంలో రాజుగారిఖజానాలో వున్న విలువైన వస్తువులు దోచుకురా. మరిచి పోయేవు, రాణీగారి ఏడువారాల నగలూ తీసుకురావాలి. విన్నావా?" అని గదమాయించింది.

అవతారం బిక్కమొహం పెట్టి, "మొదలు, నాకు గురకపెట్టడం రాదు గదా?" అన్నాడు.

అలివేలు చీదరించుకుంటూ, "మనిషి ప్రయత్నిస్తే, సాధించలేనిదంటూ ఏమీ

వుంటే, రాజుగారికి రక్షకభటుల గూఢచారుల కిచ్చే జీతభత్యాల ఖర్చుమిగిలేది!" అంటూ భార్యను మెచ్చుకుని, అప్పటికప్పుడే బయల్దేరి రాజధాని చేరి, రాజుగారిని కలుసుకుని, నల్ల టోపీ మహిమ గురించి చెప్పి, దాన్ని ఆయనకు కానుకగా ఇచ్చి, వెనుదిరిగి వెళ్ళబోయాడు.

రాజు, కొండయ్యను ఆగమని, భుజం తట్టి, "ఔరా, కొండయ్యా! నీ రాజభక్తి అమోఘం నీ కానుక విలువలేనిది. నా నుంచి బహుమానం తీసుకోకుండా వెళ్ళడం సరికాదు," అని, అప్పటికప్పుడు కోశాధికారిని పిలిపించి, కొండయ్యకు ఒక సంచీనిండుగా బంగారుకాసులు ఇప్పించాడు.

ఇంటికి తిరిగివచ్చిన కొండయ్య, సంచీలో వున్న బంగారుకాసులను చాపమీద కుమ్మరించి, "కోమలీ! ఈ డబ్బంతా ఏం చేసు

వుండదన్న సంగతి నువ్వెరగవా? ఇక కదులు, పో!" అన్నది.

అవతారం, అలివేలు చెప్పిన గుర్తుల ప్రకారం అడవి చేరి, ఒక చెట్టు చాటునుంచి నాలుగు దయ్యాలను చూసి,భయంతో వణికి పోతూ కెవ్వుమంటూ అరిచాడు. ఆ మరు క్షణం దయ్యాలు బిలబిలమంటూ వచ్చి, అతణ్ణి చుట్టుముట్టి, "ఎవర్రా చచ్చువెధవా? ఇక్కడి కొచ్చికేకపెట్టి, మాకు వినోదభంగం చేశావు," అన్నవి గుడ్లురుముతూ.

అవతారం మరింతగా వణికిపోతూ, "అది కేక కాదు,గురక!" అన్నాడు.

ఆ జవాబుకు దయ్యాలన్నీ విరగబడి నవ్వినై. దయ్యాలనాయకుడు, అవతారాన్ని మెచ్చు కుని, "నువ్వు మంచి హాస్యగాడివిరా అబ్బీ! ఇంతకూ, ఈ అమావాస్య చీకట్లో ఇంత దూరం ఎందుకొచ్చావు?" అని అడిగాడు.

ఇంకా దయ్యాలభయంతో తీరని అవతారం తడబడుతూ, "అదృశ్య పీటోకోసం!" అన్నాడు.

ఆమాటకు దయ్యాలు ఒక క్షణం ఆశ్చర్య పోయి, తర్వాత పగలబడి నవ్వినై. వాటి నాయకుడు, అవతారం వీపు తట్టుతూ, "ఓహోం, ఏమి వాక్చాతుర్యం! నువ్వు పుట్టు హాస్యగాడివిరా మనిషీ. ఇంతకూ పీటో అంటే ఏమిటి!" అని అడిగాడు.

ఆ సరికి దయ్యాల భయంపోయిన అవతారం, "టోపీ, టోపీ - అదృశ్య టోపీ!" అన్నాడు.

"అదా సంగతీ! ఇదిగో,"అంటూ దయ్యాల నాయకుడు గాలిలో చేయి వూపి, చేతికి వచ్చిన ఒక తెల్లటోపీని అవతారం నెత్తినపెట్టి, "అరే ఒరే,మనిషీ! మాకు రెండు అమావాస్య



లకు సరిపోయేంత వినోదం కలిగించావు. కనక, ఆపై అమావాస్యకు ఇక్కడికిరా," అంటూ మిగిలిన మూడు దయ్యాలతో గుడ్లగూబగా మారి గాలిలోకి ఎగిరిపోయాడు.

అవతారం అదృశ్యటోపీతో ఉత్సాహంగా అక్కడినుంచి బయలుదేరి, తెల్లవారుజాము వేళకు రాజుగారి కోట చేరాడు. అతడు టోపీ ప్రభావం వల్ల, కాపలాదార్లముందు నుంచే నడిచిపోయి, రాజుగారి ఖజానాలో ప్రవేశించి, అక్కడున్న రత్నాలూ, మణులూ, బంగారుకాసులూ ఒక గోనెసంచిలో వేసి, భుజానవేసుకుని,రాజాంతఃపురంచేరాడు.

అక్కడ రాజూ, రాణీ చెరొక హంసతూలికా తల్పం మీదపడుకుని గాఢనిద్రలో ఉన్నారు. గదిలో ఒక మూలగా వున్న దంతపుబల్ల మీద రాణీగారి ఏడువారాల నగలూ, రాజుగారి

కిరీటం ఉన్నవి. అవతారం నగలను సంచీలో వేసుకుని బయలుదేరబోతూ – అలివేలు తెలివితేటల వల్లే ఇంత ధనం దొరికింది. దానికి రాణీగారి నగలున్నప్పుడు, నాకునెత్తిన కిరీటం లేకపోవడం వెలితిగా వుంటుంది!" అనుకుని కిరీటం తీసుకుని అదృశ్యటోపీ మీద అదిమి పెట్టి, ఠీవిగా నడుస్తూ బయటకు వచ్చాడు.

అయితే, అలవాటు లేకపోవడంతో, అతడికి నెత్తిమీదకొండంత బరువుగా వున్నట్టు తోచి, కోటద్వారాన్ని దాటేముందు కిరీటాన్ని తీసి చేత్తో పట్టుకుని నడవసాగాడు. అతడు కోటద్వారాన్ని దాటుతూండగా కాపలాభటులు చూసి, "ఒరే, ఎంత ధైర్యం నీకు! రాజుగారి కిరీటాన్నే దొంగిలించుకు పోతున్నావా?" అంటూ పట్టుకుని, పెడరెక్కలు విరిచికట్టి రాజుగారి దగ్గరకులాక్కుపోయారు.

అవతారం నిలువెల్లా కంపించిపోతూ, తను కిరీటాన్ని తలమీదినుంచి తీసినప్పుడు, దానితోపాటు అదృశ్యటోపీ కూడా బయటకు వచ్చిందని గ్రహించి, బావురుమంటూ, మనసులో భార్య అలివేలును శాపనార్థాలు పెట్టసాగాడు.

రాజు, అవతారం వాలకంచూసి,అతడంత దుస్సాహసం చెయ్యడానికి కారకు లెవరో వుంటారని ఊహించి, కొండయ్య కానుకగా ఇచ్చిన నల్లటోపీని తలమీద పెట్టుకున్నాడు. ఆయనకు అవతారం, భార్యను పెడుతున్న శాపనార్థాలు తెలిసిపోయినై.

రాజు వెంటనే భటులను పంపి అలివేలును తన సమక్షానికి రప్పించి, గట్టిగా ప్రశ్నించిన మీదట, ఆమె దురాశ, ఓర్వలేనితనం బయటపడింది. రాజు, ఆ భార్యాభర్తలిద్దర్నీ అప్పటికప్పుడు కట్టుబట్టలతో రాజ్యం వదలిపోవలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఈ సంగతితెలిశాక, కోమలి కొండయ్యతో, "ఆ అమావాస్య దయ్యాల పుణ్యాన మన కాపురం చక్కబడింది. అలివేలు నీ మీద అవీ ఇవీ కల్పించి చెప్పి, నామనసు పాడు చేస్తుండేది," అన్నది.

కొండయ్య తాపీగా తలాడించి, "చూడు, కోమలీ! అడ్డమైన వాళ్ళందరు చెప్పేమాటలు నమ్మే, అవివేకం అనే దయ్యాలు మనలో ఉన్నంతకాలం, అలివేలు కాకపోతే మరొక ఆండాళ్ళు చాడీలు చెబుతుంది. నీ జాగ్రత్తలో నువ్వుండాలి. తెలిసిందా?" అన్నాడు.





# కారణానికి కారణం

ముక్తిపల్లె అగ్రహారంలో వుండే కృష్ణమాచార్యులు, అగ్రహారంలో మిగతావారి కన్నా మంచి ఆస్తిపరుడు. ఆయనకు పదిహేను ఎకరాల మాగాణిభూమి, రెండెకరాలమామిడి తోట వున్నవి.ఆయనకు మగసంతానంలేదు, ఒకే ఒక్క కుమార్తె. పేరు రుక్మిణి.

రుక్మిణి యుక్తవయస్కురాలయ్యాక, కృష్ణమాచార్యులు ఆమెకు పెళ్ళిసంబంధాలు వెదకసాగాడు. శాస్త్ర, కావ్యాలు బాగా అధ్యయనం చేసినవాడూ, అందగాడూ అయిన యువకుడికి తన కుమార్తెనిచ్చి వివాహం చేసి, అల్లుణ్ణి ఇల్లరికం తెచ్చుకోవాలన్నది ఆయన కోరిక.

అయితే, కృష్ణమాచార్యులు కోరుకున్న విధంగా అన్నిటా యోగ్యులైన యువకులు ఇద్దరు ముగ్గురున్నారు కాని, వాళ్ళల్లో ఏ ఒక్కరూ ఇల్లరికం రావడానికి ఒప్పుకోలేదు. ఈ పరిస్థితుల్లో, తల్లితో పాటు శ్రీపుర అగ్రహారానికి బంధువుల పెళ్ళికి వెళ్ళిన రుక్మిణికి, పెళ్ళిలో తల్లి తరఫు కాస్త దూరపు బంధువైన శ్రీకాంతుడనే యువకుడితో పరిచయమయింది. శ్రీకాంతుడు అంతగా ఆస్తిమంతుడు కాకపోయినా, పండితుడూ, మంచి లౌకికజ్ఞానం కలవాడూ అని అందరూ చెప్పుకునేవారు.

రుక్మిణికి, శ్రీకాంతుడిపై మనసు కలిగిందని గ్రహించిన ఆమెతల్లి మొదట ఇందుకు చాలాసంతోషించినా, భర్త ఇల్లరికపు నియమం గుర్తుకు వచ్చి నిరాశపడింది. అయినా,ఒకసారి ప్రయత్నించిచూద్దామని ఆమె అతణ్ణి, "బాబూ! నీ చదువు పూర్తయింది కదా! జీవనం కోసం ఏం చేయాలనుకుంటున్నావు?"అనిఅడిగింది.

దానికి శ్రీకాంతుడు వెంటనే, "నాకు మా నాన్న వదిలిపోయిన రెండెకరాల పొలం ఉన్నది. దానిమీద వచ్చే ఆదాయంతోపాటు మరికొంత ఆదాయం అవసరం. ఇక్కడ

డి. శంభుదాసు

అందరూ నన్ను ఏదైనా గురుకులం ప్రారంభించమని అంటున్నారు. ఆ పని చేయబోతున్నాను," అన్నాడు.

ఈ జవాబు విని రుక్మిణితల్లి చిన్నగా నిట్టూర్చి, "నేను నీకు కాస్త దూరపు బంధువునని తెలుసు గదా! బంధుత్వం బంధుత్వమే. దానికి దగ్గర, దూరం అన్న ప్రసక్తి ఉండకూడదు. మా వారు అంగీకరిస్తే నిన్ను అల్లుణ్ణి చేసుకోవాలని ఉన్నది. మాఅమ్మాయిరుక్మిణిని చూశావు గదా?" అని అడిగింది.

శ్రీకాంతుడు చిన్నగా నవ్వి, "రుక్మిణిని చూడకేం, చూశాను! ఆమె తండ్రిగారుగొప్ప స్థితిమంతులు. వారికి ఇల్లరికంరాగల అల్లుడు కావాలి. మీరు బంధువులుగనుక, అటువంటి వాడెక్కడైనా దొరుకుతాడేమో నేను ప్రయత్నించి చూస్తాను," అన్నాడు.

ఇది జరిగిన నెల రోజులకు భార్య పట్టుదలతో పాటు, రుక్మిణి తను శ్రీకాంతుణ్ణి తప్ప వివాహమాడననడంతో, చేసేదిలేక కృష్ణమా చార్యులు శ్రీకాంతుడితో, రుక్మిణి వివాహం వైభవంగా జరిపించాడు. అయితే, ఆయనలో ఇల్లరికానికంగీకరించని అల్లుణ్ణి నలుగురిలో ఏదోవిధంగా కించపరచాలన్న కోపం రగులు తూనే ఉన్నది.

పెళ్ళయిన నాలుగు నెలల తర్వాత దీపావళి పండగకు, శ్రీకాంతుడు, భార్యతోపాటు అత్తవారింటికి వచ్చాడు. ఒకనాటి సాయంకాలం, దేవాలయ మండపంలో కొందరు పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. వాళ్ళల్లో కృష్ణమాచార్యులు కూడా ఉన్నాడు. ఆ సమయంలో శ్రీకాంతుడు అక్కడికి వచ్చాడు.

కృష్ణమాచార్యులు అక్కడ వున్న వాళ్ళకు, తన అల్లుణ్ణి చూపుతూ, "మా అల్లుడుమంచి విద్యావంతుడనీ, వివేకి అనీ అంటుంటారు. అయితే, ఆ సంగతి నేనెరుగను. ఇప్పుడు మీతో పాటు నేనూ ఆ సంగతి తెలుసుకోవా



లనుకుంటున్నాను," అని, శ్రీకాంతుణ్ణి, "నువ్వు గొప్ప విద్యావంతుడివని అందరికీ తెలుసు. చిన్న ప్రశ్న! ఒక్కొక్కసారి కొంగలు గుంపులు గుంపులుగా ఆకాశంలో ఎగురుతూ,శ్రావ్యంగా అరుస్తూంటవి. ఎందువల్ల?" అన్నాడు.

"అది వాటికి ప్రకృతి ప్రసాదించింది!" అన్నాడు శ్రీకాంతుడు.

"వసంతఋతువులో, వేపా, చింతచెట్లు చిగిర్చడానికి కారణం ఏమిటి?" అన్నాడు కృష్ణమాచార్యులు.

"అదీ ప్రకృతి ప్రసాదితమే!" అన్నాడు శ్రీకాంతుడు.

"దారి వెంట అటూ ఇటూ వుండే చెట్ల బోదెలకు కణితెల్లాగా, ఇంతంత బొడిపెలుంటవి. దానికి కారణమేమై వుంటుంది?"అని అడిగాడు కృష్ణమాచార్యులు.

"ఆ కణితెలూ ప్రకృతి కారణంగా ఏర్పడినవే!" అన్నాడు శ్రీకాంతుడు.

ఆ జవాబుకు కృష్ణమాచార్యులు నవ్వి, "అంతగా విద్యాగంధం లేనివాడు కూడా, నా ప్రశ్నలకు సరైన జవాబులు చెప్పగలడు. నువ్వు చెప్పలేకపోవడం ఆశ్చర్యంగా ఉంది. కొంగలు శ్రావ్యంగా అరవడానికి కారణం, వాటికున్న పొడవాటి మెడలు.వేపా, చింతచెట్ల లాంటివి వసంతఋతువులో చిగిర్చడానికి కారణం, వాటి వేళ్ళు భూమిలో చాలాలోతుగా పోయి ఉండడం. దారి పక్కన వుండే చెట్ల బోదెలకు లోతైనగాట్లూ, కణితెల్లాంటివి ఉండడానికి కారణం, పశువులు కొమ్ములతో వాటి బోదెలను తాటిస్తూ వుండడం. కారణం ఇదైతే,నువ్వు అన్నిటికీ ప్రకృతి మూల కారణం అనడం వింతగా ఉంది!" అన్నాడు.

"మామగారితో పాటు ఇక్కడున్న పెద్ద లందరూ అనుమతిస్తే, నేను నిర్మొహమాటంగా నాలుగు మాటలు చెప్పదలిచాను," అన్నాడు శ్రీకాంతుడు వినయంగా.

చెప్పమన్నట్లు అందరూ తలలూపారు. అప్పుడు శ్రీకాంతుడు,"కప్పలు బెక బెకలాడడం, వాటికి పొడవాటి మెడలుండడమా? వెదురుచెట్లు వసంతంలో చిగిర్చడానికి కారణం, వాటి వేళ్ళు భూమిలోచాలా దూరం వ్యాపించి ఉండడమా? మామగారు క్షమిస్తే–వారి మెడమీద అంత పెద్ద కణితికి కారణం, చతుష్పాదుల కొమ్ములా?" అన్నాడు.

ఇది విని అందరూ పెద్దగా నవ్వారు. కృష్ణమాచార్యులు తలవంచుకున్నాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1997 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. Seshagiri



S.G. Seshagiri

✱పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✱ నవంబర్ నెల **15**వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✱మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✱ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బాగుపడేనా, బ్రతుకునావ!

రెండవ ఫోటో : బాల్యంలోనే ఉన్నది, చేవ!

పంపినవారు : బి. కనకలత,
29-2-41, జైల్ రోడ్
విశాఖపట్నం - 530 020 (ఆం.ప్ర)


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - **600 026**

Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026 (India), Controlling Editor: NAGI REDDI.

THE MOST ENDEARING GIFT YOU CAN THINK OF
FOR YOUR NEAR AND DEAR WHO IS FAR AWAY

# CHANDAMAMA




**Give him the magazine in the language of his choice—**
Assamese, Bengali, English, Gujarati, Hindi, Kannada, Malayalam, Marathi, Oriya, Sanskrit, Tamil or Telugu
**—and let him enjoy the warmth of home away from home.**

**Subscription Rates (Yearly)**

**AUSTRALIA, JAPAN, MALAYSIA & SRI LANKA**

By Sea mail Rs. **129.00** By Air mail Rs. **276.00**

**FRANCE, SINGAPORE, U.K., U.S.A., WEST GERMANY & OTHER COUNTRIES**

By Sea mail Rs. **135.00** By Air mail Rs. **276.00**

**Send your remittance by Demand Draft or Money Order favouring 'Chandamama Publications' to:**

CIRCULATION MANAGER **CHANDAMAMA PUBLICATIONS** CHANDAMAMA BUILDINGS
VADAPALANI MADRAS 600 026

CHANDAMAMA (Telugu) November 1996 Regd. No. M. 4854